Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆకాశంలో అన్నయ్యా

పంపినవారు :
గోవిందరావు - కాకినాడ

*

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

ఏప్రిల్ విడుదల







శారదా ఫిలింస్ వారి

# జయభేరి

దర్శకత్వం... పి. పుల్లయ్య, బి.ఎ.



రచన... ఆచార్య ఆత్రేయ - సంగీతం... పెండ్యాల

నిర్మాత.... వాసిరెడ్డి నారాయణరావు... నవయుగ రిలీజ్

PRASADS

శారదా ఫిలింస్, మదరాసు - 14.

కంటికి శోభ కూర్చే
అందానికి...




రెమీ స్నో &
పౌడర్


DIAMOND NUT
DP & CO. C.B BELLARY
POWDER




# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'


పంచతంత్రంలో అయిదవ భాగమైన "అసమీక్ష్యకారిత్వం" ఈ సంచికతో ఆరంభమవుతున్నది. ముందు వెనకలు ఆలోచించకుండా పనులు చెయ్యటంవల్ల కలిగే నష్టాలను ఈ భాగం స్పష్టం చేస్తుంది.

ఈ సంచికనుండి దక్షిణధృవఖండం తాలూకు పరిశోధనలను ప్రారంభిస్తున్నాము. ఈ పరిశోధనలు ఒక శతాబ్దం నుంచీ సాగుతున్నప్పటికీ ఇటీవల చాలా శాస్త్రీయంగా కొనసాగుతున్నాయి. ఇవి ఇంకా జరుగుతూనే ఉన్నాయి. గడచిన 12 సంవత్సరాలకాలంలో జరిగిన పరిశోధనలను గురించి చందమామలో వరుసగా ప్రకటిస్తాము. వీటిద్వారా పాఠకులు దక్షిణ ధృవప్రాంతపు వింతలను గురించీ, విచిత్రపరిస్థితులను గురించీ అనేక విషయాలు తెలుసుకోగలుగుతారు.


సంపుటి 24 : ఏప్రిల్ 1959 : సంచిక 4







# మహాభారతం

కృష్ణుడి అన్న అయిన బలరాముడు భారత యుద్ధంలో ఏ పక్షానా పోరనని తీర్థయాత్రలకు బయలుదేరివెళ్లిన సమయంలో రుక్మిణి అన్న అయిన రుక్మి ఒక అక్షౌహిణి సేనతో సహా పాండవుల వద్దకు వచ్చాడు. కృష్ణుడు సంతోషిస్తాడుగదా అని ధర్మరాజు అతనికి సమస్త సత్కారాలూ చేశాడు.

తరవాత రుక్మి అందరూ వింటూండగా అర్జునుడితో, "ఈ యుద్ధంలో నేను నీకు సహాయంచేస్తాను, భయపడకు. అసలు ఈ రాజులందరూకూడా అవసరం లేదు. నేను ఒక్కణ్ణే యుద్ధానికి పోయి కృప ద్రోణ కర్ణ భీష్ములందరినీ అవలీలగా వధించగలను!" అని ప్రగల్భాలు పలికాడు.

అర్జునుడు నవ్వి, "నేను ఒంటరిగా లోగడ కౌరవబలాలను జయించాను, ఖాండవదహనమప్పుడు సురాసురులను కూడా జయించాను. అందుచేత నాకు భయమేమీ లేదు. ఇప్పుడైనా నాకు ఒకరి సహాయం లేకపోతే జరగదని లేదు. మీరు కావలిస్తే ఇంకెక్కడికైనా వెళ్లవచ్చు. మాతోనే ఉండటం మీకోరిక అయితే మాకు ఆక్షేపణ ఏమీలేదు!" అన్నాడు.

తరవాత రుక్మి దుర్యోధనుడివద్దకు వెళ్లి అర్జునుడితో చెప్పినట్టే చెప్పాడు. దుర్యోధనుడు అతని సహాయాన్ని నిరాకరించి పంపేశాడు. బలరాముడిలాగే రుక్మికూడా భారతయుద్ధంలో పోరాడలేదు. మిగిలిన రాజులందరూ ఏదో ఒకపక్షాన పోరాడారు.

అక్కడ హస్తినాపురంలో గుడ్డిరాజు ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పిలిపించి, యుద్ధవార్తలేమిటని అడిగాడు. "సంజయా, ఈ యుద్ధం జరగటం తప్పని తెలిసికూడా మా దుర్యోధనుడి మనసు మరల్చలేక పోయాను గదా! అదేమి చిత్రమో, వాడు నా దగ్గిరికి రాగానే వాడి నిర్ణయాలన్నీ

అట్టమీది బొమ్మ





సరిగానే తోస్తాయి. ఇంతకూ నేనేమి చేయు గలను. ఏమి కానున్నదో అది జరిగితీరు తుంది. యుద్ధంలో చావటం క్షత్రియులకు ధర్మమే కదా!" అని ధృతరాష్ట్రుడు చింతాక్రాంతుడయాడు.

దానికి సంజయుడు, "రాజా, తప్పు నీలో ఉంచుకుని దుర్యోధనుడిపైన ఎందుకు వేస్తావు? విధిలో నీకు నమ్మకం ఉన్నట్టయితే అనర్థాలు జరిగినా విచారించ కుండా ఉండు!" అని బదులు చెప్పి ఆయనను ఊరడించాడు.

ఈలోపుగా దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనులతో సమాలోచించి, శకుని కొడు కైన ఉలూకుణ్ణి పిలిపించి, "నువ్వు హిరణ్వతీతీరాన ఉండే పాండవశిబిరాలకు వెళ్ళి ఒక్కొక్కరితోనూ ఈ విధంగా నా తర పున చెప్పు!" అన్నాడు. ఉలూకుడు ధర్మ రాజుతో ఏం చెప్పాలో, కృష్ణుడితో, భీము డితో, అర్జున నకుల సహదేవులతో, ఇతర రాజులతో ఏమేమి చెప్పాలో అంతా వివ రంగా దుర్యోధనుడు చెప్పాడు. ఆ మాటలు అహంకారపూరితమైనవి, వినేవారికి రోషం తెప్పించటానికి ఉద్దేశించినవి.

ఉలూకుడు పాండవశిబిరాలకు దూతగా బయలుదేరి వెళ్ళి ధర్మరాజుతో, "రాజా, దుర్యోధనుడు మీ అందరికీ చెప్పమన్న మాటలు చెబుతాను. అవి నా మాటలు కావు గనక దయచేసి నాపై ఆగ్రహించ వద్దని కోరుతున్నాను!" అంటూ, ఒక్కొక్కరి తోనూ దుర్యోధనుడు అనమన్న నిందా వాక్యాలు అన్నాడు.

ఆ మాటలు వింటుంటే పాండవులకూ, మిగిలిన రాజులకూ మాత్రమే గాక కృష్ణు డికికూడా పట్టరాని ఆగ్రహం వచ్చింది. అందరి కళ్ళూ ఎర్రబడ్డాయి, అనేకమంది పళ్ళు పటపటకొరికారు, కొందరు జబ్బలు చరుచుకున్నారు. అందరికీ కౌరవసేనలపై బడి చీల్చిచెండాడాలన్నంత కోపంవచ్చింది.



భీముడు ఉలూకుణ్ణి నానా దుర్భాషలూ అడాడు. కాని అర్జునుడు తన అన్నను వారించి ఉలూకుడితో, "దుర్యోధనుడితో అతని కోరిక నెరవేరుతుందని చెప్పు. రేపు ఉదయం యుద్ధానికి సిద్ధంగా ఉండమని చెప్పు!" అన్నాడు. తరవాత పాండవులూ, వారి తరపున యుద్ధం చేయవచ్చిన రాజులూ వేరువేరుగా దుర్యోధనుడికి చెప్పవలిసిన మాటలను ఉలూకుడితో చెప్పారు. అర్జునుడుమాత్రం దుర్యోధనుడికి ఈ మాట చెప్పమన్నాడు: "తమ పరాక్రమంమీద ఆధారపడి యుద్ధానికి దిగి, యుద్ధంలో ఇతరుల సహాయంపొందే మేము మగతనం గల వాళ్ళం. ఇతరుల పరాక్రమంపైన మాత్రమే ఆధారపడి యుద్ధానికి దిగిన నీవు పురుషాధముడవు. కనుక నే పురుషోత్తముడైన భీష్ముణ్ణి బలిచెయ్యటానికీ, కౌరవ కుల నాశనానికీ ఈ యుద్ధం తలపెట్టావు!"

అందరి మాటలూ మోసుకుని ఉలూకుడు వెళ్ళిపోయాక ధర్మరాజు తమ సేనాధిపతి అయిన ధృష్టద్యుమ్నుణ్ణి వెంటబెట్టుకుని సేనలను యుద్ధరంగానికి తీసుకువెళ్ళాడు. ధృష్టద్యుమ్నుడు తన పక్షాన గల యోధులతో వారు శత్రుపక్షంలో ఎవరెవరిని ఎదుర్కోవాలో నిర్ణయించాడు. కర్ణుడికి అర్జునుడు ప్రతియోధుడు, అలాగే దుర్యో





ధనుడికి భీముడూ, శల్యుడికి ధృష్టకేతుడూ, కృపుడికి ఉత్తమౌజుడూ, అశ్వత్థామకు నకులుడూ, కృతవర్మకు శైబ్యుడూ, సైంధవుడికి యుయుధానుడూ, భీష్ముడికి శిఖండీ, శకునికి సహదేవుడూ, వృషసేనుడికి అభిమన్యుడూ ప్రతియోధులు. ఈ విధంగా నిర్ణయించి ధృష్టద్యుమ్నుడు, "నేను ద్రోణుడికి ప్రతియోధుడుగా ఉంటాను!" అని ప్రకటించాడు. **తరవాత** అతను తన సేనలను వ్యూహాలుగా అమర్చి యుద్ధారంభం కోసం ఎదురుచూడసాగాడు.

అక్కడ కౌరవశిబిరంలో దుర్యోధనుడు తమ సేనాధిపతి అయిన భీష్ముడితో, "మహాత్మా, మన సేనలోనూ పాండవుల సేనలోనూ గల యోధులలో ఎవరెవరు అతిరథులో, ఎవరెవరు మహారథులో, ఎవరెవరు ఏకరథులో, ఎవరెవరు అర్థరథులో వివరించు!" అని కోరాడు.

భీష్ముడు ఉభయసేనలలోనూ గల యోధులు ఏయే శ్రేణికి చెందినవారో, వారు ఈ యుద్ధంలో ఏయే కారణాలచేత ఏపాటి దీక్షతో పోరాడతారో వివరించి చెప్పాడు. తాను స్వయంగా పాండవులను చంపననీ, శిఖండితో యుద్ధంచెయ్యననీ ఆయన తెలిపాడు. అలాగే ద్రోణుడికి అర్జునుడిమీద అత్యంతప్రేమ, తన కొడుకైన అశ్వత్థామ





యోధుడైనప్పటికీ అతనికి ప్రాణంతీపి కావటంచేత మహారథుడు మాత్రమే అవుతాడనీ, ఆ లోపం లేకపోతే అతిరథుడయేవాడనీ భీష్ముడన్నాడు. కర్ణుడి కొడుకైన వృషసేనుడూ, అలంబుసుడనే రాక్షసుడూ మహారథులని ఆయన చెప్పాడు; శకునిని ఏకరథుడుగా నిర్ణయించాడు.

అవతల పాండవసేనలో అతిరథులు పంచపాండవులూ, అభిమన్యుడూ, సాత్యకీ, ఉత్తమౌజుడు, యుధామన్యుడు, ధృష్టద్యుమ్నుడు, అతని సోదరుడు సత్యజిత్తుడు, కుంతిభోజుడు, ఘటోత్కచుడు. ద్రౌపది అయిదుగురు కొడుకులైన ఉపపాండవులూ, విరాటుడూ, ద్రుపదుడూ, శిశుపాలుడి కొడుకు ధృష్టకేతుడూ మహారథులు.

కంటెకూడా ఆయనకు అర్జును డెక్కువ, ఎల్లప్పుడూ అర్జునుడి శౌర్యపరాక్రమాలను మెచ్చుకుంటూ ఉంటాడు; ఆయన అర్జునుణ్ణి చంపడు, శల్యుడు పాండవులకు బంధువే అయినా ఆయన యుద్ధంలో తన మేనల్లుళ్లయిన నకులసహదేవులను మినహాయించి మిగిలిన పాండవులను సయితం చంపటానికి వెనకాడడు.

భీష్ముడు కౌరవపక్షాన గల అతిరథులలో దుర్యోధనుణ్ణీ, అతని తొంభైతొమ్మిదిమంది తమ్ములనూ, కృతవర్మనూ, శల్యుణ్ణీ, భూరిశ్రవుణ్ణీ, సైంధవుణ్ణీ, కృపుణ్ణీ, ద్రోణుణ్ణీ, బాహ్లికుణ్ణీ పేర్కొన్నాడు. అశ్వత్థామ ప్రబల

అయితే భీష్ముడు కర్ణుణ్ణి గురించి చెబుతూ, "నా ఉద్దేశంలో కర్ణుడు కేవలం అర్ధరథుడు. ఎందుచేతనంటే తన సహజ కవచ కుండలాలను కోల్పోయాడు. అదిగాక ఇతనికి పరశురాముడి శాపమూ, బ్రాహ్మణశాపమూ తగిలాయి. ఇతను అర్జునుణ్ణి ఎదుర్కొని మళ్లీ ప్రాణాలతో బయటపడడు!" అని చెప్పాడు.

ఈ మాటలను ద్రోణుడు బలపరుస్తూ, "భీష్మా, నీ మాటలలో కొంచెమైనా అసత్యం

లేదు. ఈ కర్ణుడు యుద్ధారంభంలో అందరి కన్న ముందుండి ఉత్సాహంగా పోరాడి, చివరకు యుద్ధ విముఖుడులాగా ప్రవర్తించటం నేను ప్రతి యుద్ధంలోనూ గమనించాను!" అన్నాడు.

ఈ మాటలు విని కర్ణుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను తన కోపాన్నంతా భీష్ముడిపై కక్కుతూ, "ముసలివాడా, అవకాశం దొరికినప్పుడల్లా నన్ను అకారణంగా అనరాని మాట లంటావు. దుర్యోధనుణ్ణి చూసి ఆ మాటలను భరించుతూ వస్తున్నాను. నీకు కొంచెమైనా మతి ఉన్నట్టు కనబడదు. నన్నడిగితే నీవే అర్ధరథుడవంటాను. ఈ సంగతి నాకే కాదు అందరికీ తెలుసు. నీవు కౌరవులపట్ల ద్రోహివిగా ప్రవర్తిస్తున్న సంగతి దుర్యోధనుడు గ్రహించకుండా ఉన్నాడు. నువు శత్రుపక్షంవాడివి కాకపోతే ఈ పక్షాన పోరే యోధులను ఇలాటి మాటలంటావా? జుట్టు నెరిసినంత మాత్రాన ఎవరు మహారథులో ఎవరు అతిరథులో తెలిసిపోతుందా? నోటికి వచ్చినట్టు రథాతిరథులను నిర్ణయించి వారిలో చీలికలు పెడతావా?" అన్నాడు.

తరవాత కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, ఈ భీష్ముడు నీకెక్కడ దొరికాడు. ఇటువంటివాడు సేనలో ఐకమత్యం



లేకుండా చేస్తే ఆ సేన ఎందుకైనా పనికి వస్తుందా? వయసుమళ్లిన ఈ ముసలివాణ్ణి సేనాధిపతిని చేశావు. మిగిలిన యోధులు తమ బలపరాక్రమాలతో, శౌర్యసాహసాలతో సాధించే విజయాలన్నీ చివరకు సేనాపతి వవుతాయి. అందుచేత ఈ ముసలివాడు బతికిఉండగా నేను యుద్ధం చెయ్యను. ఆ తరువాత శత్రువుల నందరినీ నేనే జయిస్తాను," అన్నాడు.

భీష్ముడు ఆగ్రహావేశంతో, "ఓరీ, నీచుడా! యుద్ధం ప్రారంభం కాబోతున్నది గనక నిన్ను చంపక విడిచిపెట్టాను. నీమాదిరిగా ఆత్మశ్లాఘం చేసుకోవటం నాకు సరిపడదు. నేను పరశురాముడి మహాస్త్రాలన్నిటికీ చలింపకుండా నిలబడినవాణ్ణి, కాశీరాజు కూతుళ్లను తెచ్చేటప్పుడు ఒంటరిగా రాజు లందరితోనూ పోట్లాడి జయించాను, నిన్ను చంపడం నాకొక విద్య కాదు. అసలు నిన్ను చేరదీయటంవల్లనే కౌరవులకీ గతి పట్టింది. మించిపోయింది లేదు, చేతనైతే ఈ దుస్థితి నివారించు!" అన్నాడు.

దుర్యోధనుడు మంచిమాటలతో భీష్ముడి కోపాన్ని శాంతింపజేసి, "తాతా, శిఖండి అందరితోబాటు ధనుర్బాణాలు ధరించి మనమీదికి యుద్ధానికి వస్తున్నాడు గదా. అతన్ని ఎందుకు చంపనంటావు? దీనికి ప్రత్యేక కారణమేదైనా ఉన్నదా?" అని అడిగాడు.

"దుర్యోధనా, నేను స్త్రీలతోనూ, స్త్రీలుగా పుట్టి కొంతకాలానికి పురుషులుగా మారిన వారితోనూ యుద్ధం చెయ్యనని వ్రతం పెట్టు కున్నాను. శిఖండి కొంతకాలం కన్యగా ఉండి తరవాత పురుషుడుగా మారాడు. అదీగాక ఈ శిఖండి పూర్వజన్మ వృత్తాంతం వింటే, నేను అతనితో ఎందుకు యుద్ధం చెయ్యనో నీకే తెలుస్తుంది," అంటూ భీష్ముడు దుర్యోధనుడికీ, అక్కడ ఉన్న ఇతర రాజు లకూ శిఖండి పూర్వజన్మ కథ చెప్పాడు.






# 10

[వేడినీటి ప్రవాహాన్ని దాటుతూన్న మహాసర్పం వెన్నుమీదుగా నడిచివెళ్లి చంద్రవర్మ పండ్లతోటను చేరుకున్నాడు. చీకటి పడిన తరవాత చెట్టుకొమ్మల్లో నిద్రిస్తున్న అతడు గండభేరుండ పక్షులు రేపిన గాలికి, అక్కడినుంచి ఎగిరివచ్చి, ఒక పక్షి వెన్నుమీద పడిపోయాడు. ఒక రాత్రివేళ అగ్నిపక్షి అక్కడికి వచ్చి, గండభేరుండ పక్షులను, మంత్రగత్తె కాపాలినిని శంఖుడి దగ్గిరకు తేవలసిందిగా కోరింది. అవి అంగీకరించాయి. —తరవాత]

అగ్నిపక్షి గండభేరుండపక్షులతో జరిపిన సంభాషణ అంతా అతి శ్రద్ధగా విన్న చంద్రవర్మకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. కాలనాగు సహాయంవల్ల తను వింతవృక్షం నుంచి పండు కోసుకు తినటంవల్లనే, తన కీనాడు పక్షుల భాష తెలియటం సంభవించింది. అందువల్ల తను నూరు యోజనాల దూరంలో వున్న శంఖుడిని చేరటానికి కాలి నడకను బయలుదేరి నానా ప్రమాదాలకూ లోనుకాకుండా, యీ గండభేరుండపక్షి ఈకలలో దాక్కుని సునాయాసంగా అక్కడికి చేరవచ్చు.

అనుకోకుండా తనకు పట్టిన యీ అదృష్టాన్ని తలుచుకుని చంద్రవర్మ ఎంతో పొంగిపోయాడు. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు గండభేరుండ పక్షులతోపాటు తాను కూడా నూరు యోజనాల దూరం ఎగిరి శంఖుడు వుండే కొండ చూస్తానా అని అతడు



ఆత్రపడసాగాడు. కాపాలినిని చేజిక్కించుకునేందుకు శంఖుడు ప్రయోగించనున్న కపటోపాయం తప్పక వమ్ము కాగలదని అతడు భావించాడు. కాపాలిని అంత అమాయకురాలు కాదు. బహుశా ఆమె తనను పట్టవచ్చిన గండభేరుండ పక్షులను కాలసర్పానికి ఆహారంగా వేసితీరుతుంది.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూండగానే భళ్ళున తెల్లవారింది. గండభేరుండ పక్షులు సూర్యకిరణాలు మీద పడగానే కళ్ళుతెరిచి, రెక్కలల్లల్లాడించి గాలిలోకి లేచినై. పక్షి వెన్నుమీది ఈకలలో దాగివున్న చంద్రవర్మ అవి ఉత్తరదిక్కుకేసి పోతున్నట్టు గ్రహించి చాలా ఆనందపడ్డాడు. చూస్తూండగానే కొండలూ, నదులూ, అడవులూ దాటి గండభేరుండ పక్షులు ఒకానొక కొండను సమీపిస్తున్నవి. వాటి సంభాషణనుపట్టి ఆ కొండ శంఖుడు వుండేదని చంద్రవర్మ గ్రహించాడు.

హఠాత్తుగా చంద్రవర్మ దాగివున్న గండభేరుండపక్షి కిందికి చూసి, రెండవ పక్షితో, "మిత్రమా, ఈ సరస్సు చూశావా? అదుగో! ఏనుగంత లావున్న మొసలి! మొసలి మాంసం తిని చాలా రోజులైంది!" అంటూ చటుక్కున సూటిగా కిందికి తిరిగి బాణంలా నిలువునా సరస్సుకేసి దూకింది.





ఇంత హఠాత్తుగా తను వున్న గండభేరుండపక్షి కిందికి వాలేసరికి చంద్రవర్మ తబ్బిబ్బయిపోయి తను పట్టుకున్న ఈకలను వదిలివేశాడు. మరుక్షణం అతడు పక్షి మీదినుంచి పక్కకు దొర్లి, తలకిందులుగా గాలిలో తేలిపోతూ వేగంగా సరస్సులోకి పడసాగాడు.

చంద్రవర్మ తన వీపు మీదినుంచి జారి సరస్సులోకి పడిపోతూండటం గండభేరుండ పక్షికి తెలియదు. అది తన దృష్టిని నీటి మీద తేలుతూన్న పెద్ద మొసలి వైపుకు కేంద్రీకరించింది. చంద్రవర్మ దృష్టికూడా ఆ మొసలికేసే ప్రసరించింది. తను గండభేరుండపక్షికో లేక సరస్సులోని మొసలికో ఆహారం అయిపోతానని అతడు నిశ్చయించుకుని ఆపాదమస్తకం వణికిపోసాగాడు. ఇంతలో సరస్సులోనుంచి పెద్ద జలధార ఒకటి తాడిచెట్టు ప్రమాణంలో అకాశంకేసి లేచింది. దభీమంటూ నీట పడిపోతూన్న చంద్రవర్మ తల పక్కకు తిప్పి అటుకేసి చూశాడు. గండభేరుండపక్షి దిక్కులు పిక్కటిల్లేలా పెద్దగా కేకవేస్తూ పైకి ఎగిరిపోతున్నది. దాని గోళ్ళమధ్య మొసలి విలవిలా తన్నుకుంటున్నది.

చంద్రవర్మ యీ దృశ్యాన్ని కనురెప్పపాటు కాలం మాత్రమే చూడగలిగాడు.






మరుక్షణం అతడు సరస్సులో బుడుంగు మంటూ మునిగిపోయాడు. కొద్దిసేపటి తరవాత అతడు తెప్పరిల్లి నీటిపైకి లేస్తూ, సరస్సుకేసి చూసేసరికి చిన్నా పెద్ద మొసళ్లు కొన్ని చెల్లాచెదరుగా యీదుకుంటూ పారిపోవటం కనిపించింది.

ఇదీ ఒకవిధంగా నా మేలుకే జరిగింది; అనుకున్నాడు చంద్రవర్మ. గండభేరుండ పక్షులను చూసిన భయంలో మొసళ్లు ఆ ప్రాంతాన్నుంచి పారిపోతున్నవి. అలా కాకపోతే యీసరికి అవి తనను చుట్టుముట్టి, చెయ్యీ, కాలూ, తలా దొరకపుచ్చుకుని తన శరీరాన్ని ఛిన్నాభిన్నం చేసివుండేవి.



చంద్రవర్మ ప్రాణాపాయంనుంచి బయటపడ్డాననే ధైర్యంతో గబగబా యీదుకుంటూ సరస్సు ఒడ్డుకేసి పోసాగాడు. ఆ సరస్సు ఒడ్డున గుబురుగా పెరిగిన చెట్లు వున్నవి. ఒకసారి తను ఆ ప్రాంతాన్ని చేరుకుంటే, మాంత్రికుడైన శంఖుడి భృత్యుల కంట పడకుండా దాక్కోవచ్చునని అతడు భావించాడు.

ఇంకా ఒడ్డు ఇరవై ముప్పై గజాల దూరం వుందనగా, చంద్రవర్మకు అల్లంత దూరంలో నీరు అల్లకల్లోలం అవటం కనబడింది. ఆ వెంటనే పెద్దగా నోరు తెరిచిన ఒక మొసలి తోకతో నీటిని చిందరవందర చేస్తూ వేగంగా అతడికేసి రాసాగింది.

చంద్రవర్మ ఒక్క తృటికాలం స్తంభించిపోయాడు. శరీరం రాయికట్టినట్టు నీటి అడుగుకు గుంజుకుపోసాగింది. మరుక్షణం అతడు భీతితో కెవ్వుమని కేకపెట్టి ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని, ఒడిసెల నుంచి విసిరిన రాయిలా దూసుకుంటూ పోయి ఒడ్డుమీద పడ్డాడు.

అతణ్ణి అప్పడంముక్కలా నమిలి మింగదలచిన మొసలి కొంచెం ఆలస్యంగా ఒడ్డు చేరింది. కాని, యీలోపలే చంద్రవర్మ నీటిలోనుంచి లేచి గుబురుచెట్లలోకి పరి



గెత్తాడు. మొసలి అతడు పరిగెత్తిన వైపుకే కోరలు చాస్తూ కొంచెంసేపు చూసి, నిరాశతో తలను నీట ముంచి యీదుకుంటూ సరస్సు మధ్యకు వెళ్లిపోయింది.

చంద్రవర్మ ఆయాసంతో రొప్పుతూ ఒక చెట్టు బోదెకు ఆనుకుని కొంచెంసేపు విశ్రమించాడు. తరవాత అతడికి తన కత్తి సంగతి గుర్తుకొచ్చింది. గండభేరుండపక్షి మీదినుంచి సరస్సులోకి పడిపోయినప్పుడు, తను దానిని పోగొట్టుకున్నానేమో అని అతడు భయపడ్డాడు. ఆవెంటనే అతడు తన ఒరకేసి చూసుకున్నాడు. ఒరనుంచి కత్తి కొంచెం బయటికి వచ్చివున్నది. చంద్రవర్మ కత్తిని బయటికి లాగి ఒరలో చేరిన నీటిని కింద పారపోసి, తృప్తిగా కత్తిని తిరిగీ ఒరలో పెట్టాడు.



"ఇంతవరకూ నేను అదృష్టవంతుణ్ణే. నూరు యోజనాల దూరం మార్గప్రయాస లేకుండా అధిగమించగలిగాను. సరస్సులో పడి మొసళ్లకు ఆహారం కాకుండా బయటపడ్డాను. ఆత్మరక్షణకు ఉపకరించే ఒకే ఒక ఆయుధం—నా కత్తిని జారవిడుచుకోలేదు. ఇక యిప్పుడు కర్తవ్యం?" అనుకుంటూ చంద్రవర్మ లేచి నిలబడి కొంచెం దూరం నడిచి గుబురుచెట్లను జాగ్రత్తగా పక్కకు వత్తిగించి దృష్టిని ముందుకు సారించాడు. ఎదురుగా—బహుసమీపంలో ఒక ఎత్తయిన కొండ. ఆ కొండశిఖరం మొన తేలినట్టు, బొంగరం ముక్కులా వున్నది. అది అక్కడినుంచి దిగువకు కొంచెం కొంచెమే పరుచుకుపోతూ, సమతలాన్ని చేరేసరికి చాలా వెడల్పుగా తయారైంది. దూరంనుంచి చూస్తే ఆ కొండ తలకిందులుగా పెట్టిన బొంగరంలా కనబడుతున్నది.

"ఇది మాంత్రికుడైన శంఖుడు వుండే కొండ. నేను దాని దాపులకు చేరాను. నాక్కావలసింది ఆ మాంత్రికుడి పూజా గృహంలో వున్న అపూర్వశక్తులు గల







శంఖం. ఆ శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక మేకుకు వేలాడుతూ వుంటుంది. నేను ఆ శంఖాన్ని తస్కరించి కాపాలినికి యివ్వాలి. భేష్, యింతవరకూ అంతా సవ్యంగానే వున్నది. ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా ?''

చంద్రవర్మ యీవిధంగా లోలో కొంత సేపు మథనపడి పెద్దగా నిట్టూర్చాడు. కాపాలినికి మాట యిచ్చి అతడు శంఖుడు వుండే కొండప్రాంతానికి బయలుదేరినప్పుడు, అతణ్ణి బాధించిన సమస్య ఒక్కటే — అది నూరు యోజనాలు నడిచి ఆ కొండను చేరటం ఎలానా అని. కాని, తీరా యిప్పుడు ఆ కొండను చేరింతరవాత, ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా సాధ్యమవుతుందా అన్న సమస్య అతణ్ణి బాగా కలవరపరచసాగింది.

చంద్రవర్మ యిలాంటి తెగని సమస్యలతో కిందుమీదవుతూండగా హఠాత్తుగా అతడి కర్ణపుటాలు బద్దలయేలా పెద్ద కేక వినబడింది. చంద్రవర్మ ఉలిక్కిపడ్డాడు. అంతలో భీతి కొల్పే ఆ కేక మరోసారి వినిపించింది. ఈసారి చంద్రవర్మ ఆ కేక ఎవరిదో గుర్తించాడు. ఆ చుట్టుపక్కల వున్న చెట్లగుంపుల్లోనుంచే ఆ కేక వినవస్తున్నది. అది అగ్నిపక్షి వేసే కేక. గత రాత్రి అది గండభేరుండ పక్షులతో మంతనాలాడి తీరా ఎగిరిపోయే ముందు అలాగే కేకపెట్టింది.

ఇప్పుడు తను మాంత్రికుడైన శంఖుడి నివాసప్రాంతాల వున్నాననీ, అతడి సేవకుల నుంచిగానీ, లేక అతడి నుంచిగానీ తనకు కీడు కలిగే అవకాశం వున్నదనీ చంద్రవర్మ గ్రహించాడు. అవెంటనే అతడికి అగ్నిపక్షికి పగటివేళ కళ్లు కనబడవన్న సంగతి గుర్తుకొచ్చింది. అందువల్ల తనకు దాని నుంచి ప్రమాదం వచ్చే అవకాశం



లేదు. కాని, శంఖుడి యితర భృత్యుల మాటేమిటి ?

చంద్రవర్మ యిలాంటి భయాలతో కొంచెంసేపు బాధపడి, చివరకు మొండి ధైర్యం తెచ్చుకున్నాడు. తను తగిన జాగరూకతతో వుండటం తప్ప, ఎప్పుడో రానున్న ప్రమాదాన్ని గురించి యిప్పటినుంచే దిగులుపడటం వృథా అని తేల్చుకున్నాడు. అవెంటనే అతడి మనసులో ఎక్కడలేని ధీమా, శరీరంలో ఎక్కడలేని సత్తువా పరవళ్లు తీసింది.

చంద్రవర్మ తను వున్న తోటలో అక్కడా యిక్కడా వెతికి తనకు నచ్చిన పండ్లూ ఫలాలూ కోసుకు తిని, సరస్సులోకి ప్రవహిస్తున్న ఒక సెలయేటిలో తియ్యని నీరు తాగాడు. తరవాత అతడు గుబురుగా వున్న ఒక చెట్టుమీదికి ఎక్కి ఆ కొమ్మలా రెమ్మల చాటున తృప్తిగా పడుకుని, ఎప్పుడు చీకటి పడుతుందా అని అదుర్దాగా ఎదురుచూడసాగాడు. చీకటి పడిన తరవాత మాత్రమే తను శంఖుడు వుండే కొండ ఎక్కటం క్షేమకరమని అతడు నిర్ణయించుకున్నాడు.

ప్రయాణ బడలికవల్లా, మితిలేని అదుర్దావల్లా చంద్రవర్మకు కొద్దిసేపటికే చెట్టు కొమ్మల్లో నిద్ర పట్టిపోయింది. సూర్యుడు ఆకాశం మధ్యకు వచ్చినప్పుడు





కూడా వత్తుగా వున్న చెట్టు ఆకుల చాటున వుండటంవల్ల అతడిమీద ఎండ పొడ పడ లేదు. ఆ కారణంవల్ల సూర్యాస్తమయమై క్రమంగా చీకటి కమ్ముకున్నా, అతడు యింకా మైమరచి నిద్ర పోతూనేవున్నాడు.

హఠాత్తుగా ఒక రాత్రివేళ చంద్రవర్మ ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు. చుట్టూ కటిక చీకటి. సమీపంలోని సరస్సునుంచి చిన్న చిన్న ధ్వనులు వినిపిస్తున్నవి. గాలితాకిడికి తోటలోని చెట్లకొమ్మలు ఒకదాని కొకటి ఒరుసుకుని కిర్రుకిర్రుమంటూ శబ్దిస్తున్నవి. ఎక్కడా మనుష్య సంచారం లేదు.

"బాగా పొద్దు పోయినట్టున్నది. ఇదే మంచి అదను. కొండ ఎక్కి శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చుకుంటాను," అనుకుంటూ చంద్రవర్మ చెట్టు మీదినుంచి దిగి ఒకసారి వొళ్లు విరుచుకుని, ఒరలోని కత్తికేసి ఓమారు చూసుకుని బయలుదేరాడు.

చంద్రవర్మ చీకటిలో నేలబారుగా వున్న చెట్లకొమ్మలనూ, చిన్నచిన్న పొదలనూ జాగ్రత్తగా తప్పుకుంటూ కొండకేసి కొంత దూరం నడిచాడు. అతడి కళ్లు ఆ గాఢాంధకారంలో అగ్నిపక్షి కోసం వెతుకుతున్నవి. తనకు ముందుగా రానున్న ప్రమాదం దానినుంచే అని అతడికెందుకనో అనుమానంగా వున్నది. ఆ పక్షిగాని ఈసమయంలో, ఆ చాయల లేకుండావుంటే, తను సురక్షితంగా శంఖుడి మంత్రగృహంలో ప్రవేశించగలనన్న నమ్మకం అతడికి కలిగింది.

చంద్రవర్మ కొండ అడుగును సమీపించబోతున్నంతలో, అతడికి దాపులనే వున్న ఒక ప్రదేశంనుంచి చిన్న మూలుగూ, ఆ వెంటనే, "వర్మా!" అన్న సన్నని పిలుపూ వినిపించినై. చంద్రవర్మ ఆ గొంతు ఎవరిదో చప్పున గ్రహించాడు. అతడు, "కాపాలినీ!" అంటూ ఆ పిలుపు వచ్చిన వైపుకు వేగంగా నడిచాడు.

—(ఇంకా వుంది)





# వడ్లగింజలో బియ్యపుగింజ

మెస్సీనా పరిపాలకుడు లియొనాటో. ఈయన కుమార్తె పేరు హీరో. బియాట్రిస్ అనే పిల్ల లియొనాటో తమ్ముడి కుమార్తె. హీరో బియాట్రిస్‌లు ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. అయితే వారి మనస్తత్వాలలో చాలా తేడా ఉన్నది. హీరో ఎప్పుడూ గంభీరంగా ఉండేది. బియాట్రిస్ అలా కాక ఎంతో ఉల్లాసంగా ఉంటూ, తన ఛలోక్తులతో హీరోను రంజింపచేస్తూండేది.

ఇలాఉండగా ఒకనాడు లియొనాటో భవనానికి కొందరు అతిథులు వచ్చారు. వారు అంతకుముందే ముగిసిన యుద్ధంలో పాల్గొని తమతమ దేశాలకు తిరిగి పోతూ మెస్సీనాలో ఆగారు. వారిలో ఒకడు ఆరగాన్ దేశపురాజు డాన్‌పేడ్రో. రెండవవాడు అతని మిత్రుడైన క్లాడియో—ఫ్లారెన్స్‌రాజు. వారి వెంట పడూవా రాజకుమారుడు బెనెడిక్ కూడా ఉన్నాడు; ఇతను గొప్ప మాటకారి, హాస్యగాడు. వీరు ముగ్గురు లియొనాటోకు పరిచితులే. అయన ఈ అతిథులను తన కుమార్తెకూ, తమ్ముని కుమార్తెకూ, మిగిలిన వారికీ పరిచయం చేశాడు.

బెనెడిక్ తన సహజధోరణిలో లియొనాటోతో కబుర్లు సాగించాడు. మాటకారితనంలో తనతో అతను పోటీపడుతున్నాడని రోషంవచ్చి బియాట్రిస్, "బెనెడిక్ మహాశయా, ఎవరూ వినిపించుకోకపోయినా మీరు సంభాషణ మానరులాగుందే!" అన్నది.

ఈ మాటలు వినగానే బెనెడిక్‌కు కోపం వచ్చింది. కిందటిసారి తాను ఇక్కడికి వచ్చినప్పుడుకూడా బియాట్రిస్ ఇలాగే తనను చీటికీ మాటికీ వెటకారం చేసిందని జ్ఞాపకం వచ్చి అతను, "అమ్మాయిగారూ, తమరింకా జీవించే ఉన్నారా?" అని అడిగాడు.

ఇంకేముందీ? ఇద్దరిమధ్యా వాగ్యుద్ధం ఆరంభమయింది; ఇద్దరూ ఒకరినొకరు

విలియం షేక్స్పియర్

క్షమించరాని మాట లనుకున్నారు. హీరో మాత్రం ఇదంతా చూస్తూ మౌనంగా కూచున్నది. క్లాడియో ఆమె అందం చూసి ముగ్ధుడయాడు. కిందటిసారి అతను చూసి నప్పుడు ఆమె చాలాచిన్నది. క్లాడియో మిత్రు డైన డాన్‌పీడ్రో, బెనెడిక్ బియాట్రిస్‌ల వాగ్యుద్ధానికి చాలా ఆనందించి, "వీరిద్దరూ సమ ఉజ్జీలు. వీరికి వివాహం చేస్తే, చాలా బాగుంటుంది!" అన్నాడు నవ్వుతూ.



దానికి లియొనాటో, "అయ్యో, పెళ్ళి అయిన వారంరోజులలో ఇద్దరూ మతులు పోగొట్టుకోరా?" అన్నాడు.

తరవాత డాన్‌పీడ్రో క్లాడియోలు తమ బసకు తిరిగి వచ్చారు. అక్కడ క్లాడియో తన మిత్రుడితో తనకు హీరోపై ప్రేమ కలిగి నట్టు బయటపెట్టాడు. ఈ విషయాన్ని డాన్‌పీడ్రో లియొనాటోతో చెప్పాడు. లియొ నాటో వారి వివాహనికి అభ్యంతరం చెప్ప లేదు. క్లాడియో హీరోతో మాట్లాడి తనను పెళ్లాడవలసిందిగా కోరాడు. హీరో అందుకు సమ్మతించింది. వారిద్దరికీ పెళ్లి నిశ్చయ మయింది. ముహూర్తంకూడా కొద్దిరోజు లలో ఏర్పాటయింది.

ముహూర్తం రోజు ఎప్పుడు వస్తుందా అని ముళ్లమీద వున్న క్లాడియోకు కాల యాపన కాగలందులకు డాన్‌పీడ్రో ఒక నాటకం ఆడ తలపెట్టాడు. బియాట్రిస్ బెనెడిక్‌లకు వివాహం అయితే బాగుంటుం దని ఆయన అదివరకే అనుకున్నాడు. ఇప్పుడది సాధించే ఉపాయంకూడా ఆయన ఆలోచించాడు. అదేమిటంటే, బెనెడిక్ బియాట్రిస్‌లు తమ విరోధం మాని ఒకరి నొకరు ప్రేమించేలాగు చెయ్యటం. ఇందులో సహాయం చెయ్యటానికి లియొనాటో, ఆయన కుమార్తె హీరో సమ్మతించారు.

ఈ నాటకంలో మొదటి రంగం ఇలా ఆరంభమయింది. బెనెడిక్ ఒంటరిగా ఒక పొదరింటకూచుని ఏదోచదువుకుంటున్నాడు.

ఆ సంగతి తెలియనివారిలాగా డాన్‌పీడ్రో, లియొనాటో, క్లాడియోలు సంభాషించు కుంటూ పొదరింటి పక్కగా వచ్చారు.

"చూడు, లియొనాటో, మీ బియాట్రిస్ నిజంగా బెనెడిక్‌ను ప్రేమిస్తున్నదంటారా? ఆ పిల్ల ఎవరినీ ప్రేమించేదానిలాగా కనిపించదే?" అన్నాడు డాన్‌పీడ్రో.

"నేనూ అలాగే అనుకున్నాను. చిత్రమేమిటంటే, అది తనకు బెనెడిక్ అంటే ఎంతో విరోధం ఉన్నట్టుకూడా పైకి నటిస్తుంది!" అన్నాడు లియొనాటో.

"అదంతా దొంగవేషం! బియాట్రిస్ బెనెడిక్‌కోసం తపిస్తున్నదని హీరో నాతో స్వయంగా చెప్పింది. బెనెడిక్ ఆమెను ప్రేమించని పక్షంలో బియాట్రిస్ ఏమయిపోతుందోనని హీరోకు భయంగాకూడా ఉన్నది," అన్నాడు క్లాడియో.

"బెనెడిక్ మటుకు బియాట్రిస్‌ను ప్రేమించటం కలలో మాట!" అన్నాడు లియొనాటో.

డాన్‌పీడ్రో కొంచెం ఆలోచించినట్టు నటించి, "పోనీ మనం ఈ సంగతి బెనెడిక్‌తో చెప్పేస్తే?" అన్నాడు.

"ఇంకా నయం! ఈ సంగతి తెలిస్తే బెనెడిక్ బియాట్రిస్‌ను మరింత ఏడిపించుకు తింటాడు," అన్నాడు క్లాడియో.



"ఏడిపిస్తే అతన్ని ఉరితీసినా పాపం ఉండదు! బియాట్రిస్ ఎంత మంచిపిల్ల! ఆమె చేసిన ఒక్కతప్పు బెనిడిక్‌ను ప్రేమించడమే," అన్నాడు డాన్‌పీడ్రో.

తరవాత వాళ్లు మరొక విషయం మాట్లాడుతూ ముందుకు సాగిపోయారు. వారి సంభాషణ యావత్తూ పొదరింటిలో ఉన్న బెనెడిక్ విన్నాడు. వారి మాటలలో అతనికి గురి కుదిరింది. బియాట్రిస్‌ను తాను ప్రేమించి తీరాలనుకున్నాడు. అదివరకు ఆమెతో విరోధం కట్టినందుకు పశ్చాత్తాపపడ్డాడు. మరికొంచెంసేపటికి బియాట్రిస్ వచ్చి, "నేను పోను మొర్రో అంటుంటే నన్ను పంపారు. భోజనాలకు రావచ్చునని చెప్పమన్నారు!" అన్నది.

"పాపం, నీకెంత శ్రమ ఇచ్చారు, బియాట్రిస్!" అన్నాడు బెనెడిక్. బియాట్రిస్ అతనిలో మార్పు గమనించక తన మొరటు హాస్య ధోరణిలోనే మాట్లాడింది. కాని బెనెడిక్ చెవులకు ఆ పరుషపు మాటలలో ప్రేమ దాగిఉన్నట్టు ధ్వనించింది.

మగవాళ్ళు బెనెడిక్‌కు పన్నిన ఉచ్చులాటిదే హీరోకూడా బియాట్రిస్‌కోసం పన్నింది. ఉర్సులా, మార్గరెట్ అని హీరోకు ఇద్దరు చెలికత్తెలున్నారు. ఆమె మార్గరెట్‌తో "మన బియాట్రిస్ మన అతిథులతో ఏదో





మాట్లాడుతున్నది. నువువెళ్ళి ఆమెచెవిలో రహస్యంగా, 'హీరో తోటలో ఉర్సులాతో నిన్నుగురించి ఏమిటో చెబుతున్నది. నువు చల్లగా పొదరింట నక్కి, అదేమిటో విను!' అని చెప్పు," అన్నది.

ఈ ఎత్తు పారింది. బియాట్రిస్ తోటలోకి వచ్చి, హీరో ఉర్సులాతో మాట్లాడుతూండటం గమనించి, ఆకులతో దట్టంగా మూసుకుని ఉన్న పొదరింట చల్లగా దూరింది. అంతకు కొద్దిసేపటికి పూర్వం బెనెడిక్ కూచుని ఉన్న పొదరిల్లే అది.

కాస్సేపటికి హీరో ఉర్సులా వెంట అటుగా వస్తూ, "నీకు తెలియదు, ఉర్సులా, బియాట్రిస్ వట్టి పెడకట్టె! మనం ఏంచెప్పీ లాభంలేదు," అన్నది.

"ఇంతకూ బెనెడిక్ బియాట్రిస్ కోసం తపించిపోతున్నమాట నిజమేనా?" అని అడిగింది ఉర్సులా.

"నాకుమాత్రం ఏంతెలుసూ? క్లాడియో, డాన్‌పీడ్రో లిద్దరూ నాకాసంగతిచెప్పి, బియాట్రిస్‌కు చెప్పమన్నారు. అంతకన్న పొరపాటు మరొకటి ఉండదని వారితో అన్నాను. ఈసంగతి బియాట్రిస్‌కు తెలిస్తే బెనెడిక్‌ను మరింత గేలిచెయ్యదా?" అన్నది హీరో.

"బెనెడిక్‌లాటి యోగ్యుడు తనను ప్రేమిస్తున్నాడని తెలిశాక గేలిచెయ్యదేమో?" అన్నది ఉర్సులా.

తరవాత వాళ్ళిద్దరూ హీరో పెళ్ళిగురించి మాట్లాడుకుని, ఆమె పెళ్ళిదుస్తులు చూసే నెపంమీద వెళ్ళిపోయారు.

ఈ సంభాషణ విన్నాక బియాట్రిస్ మనసు పూర్తిగా మారిపోయింది. ఈసారి కలుసుకున్నప్పుడు ఆమె బెనెడిక్‌తో ఎంతో ప్రేమగా మాట్లాడింది. చూస్తూండగానే వారి శత్రుత్వం దృఢమైన ప్రేమబంధంగా మారిపోయింది.

కాని హీరో క్లాడియోల ప్రేమబంధాన్ని మటుకు పురుగు ముట్టింది.



డాన్‌పీడ్రో సవతితమ్ముడు డాన్‌జాన్ అనే వాడుకూడా యుద్ధాలనుంచి తిరిగివస్తూ మెస్సీనాలో దిగాడు. ఇతనిది మంచి తత్వం కాదు; ఎప్పుడూ ఎవరికి ఏమి హానిచేద్దామా అనే చూస్తూంటాడు. అతనికి తన అన్న అంటే పడదు, ఆయన మిత్రుడు గనక క్లాడియోను చూస్తేకూడా అసహ్యమే. "క్లాడియో హీరోను సుఖంగా ఎందుకు పెళ్లాడాలి? దీనికేదైనా విఘాతం కల్పింతాం," అనుకుని అతను ఇందుకుగాను బొరాఖియో అనే తన అనుచరుణ్ణి ప్రేరేపించాడు.

ఈ బొరాఖియో అనేవాడు అన్నివిధాలా డాన్‌జాన్‌లాటివాడే. ఇతను హీరో చెలికత్తె అయిన మార్గరెట్‌ను పెళ్లాడే ప్రయత్నం సాగించాడు; వారిద్దరికీ మాటలు కుదిరాయి. బొరాఖియో తన ప్రేయసి అయిన మార్గరెట్‌తో, "ఇవాళరాత్రి మీ యజమానురాలు నిద్రపోయాక, నువు ఆమె దుస్తులు ధరించి, ఆమె పడకగది కిటికీలోనుంచి బయటికి వంగి నాతో కాస్సేపు రహస్యంగా మాట్లాడాలి," అన్నాడు.

అందులో ఉన్న మోసం గుర్తించక మార్గరెట్ ఒప్పుకున్నది.

మర్నాడే హీరోకూ, క్లాడియోకూ పెళ్లి. డాన్‌జాన్ తన సవతి అన్న బసకు వెళ్లి క్లాడియో వింటూండగా, "ఈ హీరో చాలా వెకిలిమనిషిలాగా కనబడుతుంది. అర్థ రాత్రివేళ తన గది కిటికీవద్ద నిలబడి ఎవ రెవరితోనో రహస్యాలు మాట్లాడుతుంది," అన్నాడు. ఆ మాటలు వారు నమ్మలేక పోయారు. "కావలిస్తే ఈ రాత్రి మీరు నాతో రండి. మీకళ్లతో మీరే చూడవచ్చు!" అన్నాడు డాన్‌జాన్.

ఆ రాత్రి డాన్‌పీడ్రో, క్లాడియోలు డాన్‌జాన్ వెంట వెళ్లి, హీరో గది గవాక్షం నుంచి మార్గరెట్ తన ప్రియుడితో రహస్యంగా మాట్లాడుతూ ఉండటం చూశారు. అయితే మార్గరెట్ తన యజమానురాలి దుస్తులు

ధరించి ఉండటంచేత ఆమెను చూసి వారు హీరో అనే అనుకున్నారు.

క్లాడియో మనస్సు పూర్తిగా విరిగి పోయింది, అతనికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. రేపు తనను పెళ్లాడబోయే మనిషి ఇవాళ రాత్రి ఎవడితోనో రహస్యాలు మాట్లాడటమా? ఇంతకన్న హీనం ఏమైనా ఉంటుందా అనుకున్నాడు క్లాడియో.

మర్నాడు పెళ్లికి అందరూ చర్చిలో చేరి, పురోహితుడు పెళ్లితంతు ప్రారంభించబోయే సమయంలో క్లాడియో హీరోను నానా దుర్భాషలూ ఆడాడు. ఏ పాపమూ ఎరగని హీరో విస్తుపోయి, "ఏమిటి ఇలా మాట్లాడుతున్నారు? మీ వొంట్లో కులాసాగా లేదా?" అని అడిగింది.

లియోనాటో డాన్‌పీడ్రో కేసి తిరిగి, "తమరుకూడా చూస్తూ ఊరుకుంటారేమిటి?" అన్నాడు.

"ఆమె అయోగ్యురాలన్న విషయం నిన్నరాత్రి నేనూ, నా తమ్ముడూ, క్లాడియో ప్రత్యక్షంగా చూశాం. క్లాడియో అలాటిదాన్ని పెళ్లాడటం నాకు మాత్రం తలవంపులు కాదా?" అన్నాడు డాన్‌పీడ్రో.

మరుక్షణం హీరో కొయ్యబారిపోయి స్పృహలేకుండా పడిపోయింది. ఆమె గతి ఏమవుతుందోనన్న కనికరంకూడా లేకుండా



డాన్‌పేడ్రో, క్లాడియోలు చర్చి నుంచి బయటికి వెళ్ళిపోయారు.

హీరోకు స్పృహ తెప్పించటానికి బియాట్రిస్ విశ్వప్రయత్నాలు చేసింది. ఆమెకు హీరోయందు అపారమైన విశ్వాసం. అందుచేత వారు చేసిన ఆరోపణను ఆమె కొంచెంకూడా నమ్మలేదు. బెనెడిక్ బియాట్రిస్‌కు తోడ్పడుతూ, "హీరో ఎలా ఉంది?" అని అడిగాడు.

"చచ్చిపోయినట్టుంది!" అన్నది బియాట్రిస్.

ఈ మాట విని లియొనాటో తృప్తిపడ్డాడు. ఎందుచేతనంటే తన కుమార్తెపైన డాన్ పేడ్రో చేసిన ఆరోపణను ఆయన పూర్తిగా నమ్మాడు. తనకింత అవమానం తెచ్చిపెట్టిన కూతురు బతికిఉండేకన్న పోవటమే మేలని ఆయనకు తోచింది.

"ఇందులో ఏదో మోసం ఉన్నది! నా మాట నమ్మండి," అన్నాడు ముసలి పురోహితుడు. ఆయన చాలా వివేకం గలవాడు తనపైన అభాండం పడినప్పుడు హీరో ఎలా పాలిపోయిందో, ఆమె మనస్సు ఎంత బాధ పడిందో ఆయన గమనించాడు. దోష స్వభావం గలవాళ్లు అలా బాధపడరు.

కొంచెంసేపటికి హీరో మూర్ఛనుంచి తేరుకున్నది. పురోహితుడు ఆమెతో, "తల్లీ





"నువు రహస్య సంభాషణ చేశావని వాళ్లు అన్నది ఏమనిషితో ?" అని అడిగాడు.

"నే నెవరినీ ఎరగను. ఆ మనిషి ఎవరో వాళ్లకే తెలియాలి," అన్నది హీరో. ఆమె తన తండ్రితో, "నాన్నా, నేను నిన్నరాత్రి ఎవరితో మాట్లాడిఉన్నా నన్ను ద్వేషించు, విసర్జించు, చిత్రవధ చేయించు !" అన్నది.

"ఏకారణంచేతనో డాన్‌పీడ్రో, క్లాడియోలు పొరపడ్డారు," అన్నాడు పురోహితుడు. "మీ అమ్మాయిని మా ఇంట దాస్తాను. ఆమె చనిపోయిందని అందరికీ చెప్పండి. ఆమెను పాతిపెట్టినట్టు ప్రకటించి, సమాధికూడా కట్టించండి."

"అందువల్ల ఏమిటి ప్రయోజనం?" అని లియొనాటో అడిగాడు.

"ఆమె మరణవార్త విన్నమీదట క్లాడియో మనస్సులో ఉండే కాఠిన్యం కరిగిపోతుంది. అంతేగాక అతని ప్రేమ నిజమైనదైతే అతను తప్పక పశ్చాత్తాపపడతాడు," అన్నాడు పురోహితుడు. బెనెడిక్‌కూడా పురోహితుణ్ణి బలపరిచాడు. అతను హీరో రహస్యాన్ని దాస్తానన్నాడు. లియొనాటోకు ఏ నిర్ణయంగాని చేసే శక్తి పోయింది. "మీరేం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు.

లియొనాటోనూ, హీరోనూ వెంటబెట్టుకుని పురోహితుడు తన ఇంటికి వెళ్లాక బెనెడిక్ బియాట్రిస్‌తో, "మీ సోదరికి చాలా అన్యాయం జరిగిందని నా అంతరాత్మ చెబుతున్నది," అన్నాడు.

"ఆ అన్యాయానికి ప్రతీకారంచేసే మనిషిని నేను పువ్వులలో పెట్టి పూజించనా ?" అన్నది బియాట్రిస్.

"నీకోసం ఏంచెయ్యమన్నా చేస్తాను, చెప్పు !" అన్నాడు బెనెడిక్.

"క్లాడియోను చంపెయ్యి !" అన్నది బియాట్రిస్.

"ఛీ, ఛీ ! చచ్చినా ఆపని చెయ్యను," అన్నాడు బెనెడిక్. కాని బియాట్రిస్ అతనిని

సాధింపుమాటలతో వేధించి, క్లాడియోతో కత్తియుద్ధం చెయ్యటానికి ఒప్పించింది.

ఈలోపల లియొనాటో, డాన్‌పీడ్రో క్లాడియోల బసకు వెళ్లి, "మీమూలంగా నా కుమార్తె చనిపోయింది. మగవాళ్లయితే నాతో యుద్ధం చెయ్యండి," అని సవాలు చేశాడు. వారు ఆ వృద్ధుణ్ణి చూసి జాలిపడి, "మీరు పెద్దలు, మాతో ఎందుకు అకారణంగా తగాదాపడతారు?" అన్నారు. సరిగా ఆసమయంలో బెనెడిక్ వచ్చి క్లాడియోను యుద్ధానికి ఆహ్వానించాడు.

"బియాట్రిస్ ఇతన్ని ప్రేరేపించి నట్టుంది!" అని వారు అనుకున్నారు.

ఇంతలో కొందరు భటులు బొరాఖియోను బందీగా చేసి అక్కడికి పట్టుకువచ్చారు. ఎందుచేతనంటే, డాన్‌జాన్ ప్రేరేపణతో తానుచేసిన దుర్మార్గంగురించి వాడు ఎవరితోనో చెప్పాడు. ఆ విధంగా నౌకర్లకు నిజం తెలిసిపోయింది.

బొరాఖియో జరిగినదంతా ఒప్పుకున్నాడు. వాడి మాటలకు వేరే సాక్ష్యం కూడా అవసరం లేకపోయింది; ఎందుకంటే, బొరాఖియో పట్టుబడగానే డాన్‌జాన్ ఎవరికీ చెప్పకుండా మెస్సీనా విడిచి పారిపోయాడు. ఇదంతా చెవులారా విన్న క్లాడియోపడిన మనోవేదన వర్ణనాతీతం.



అతను లియొనాటోకు క్షమాపణ చెప్పుకుని, "మీరు నాకు ఏ శిక్ష విధించినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

"మా హీరోకు వేలువిడిచిన సోదరి ఒకతె ఉన్నది. నా ఆస్తిఅంతా ఆమెకే చెందుతుంది. రేపే నువ్వామెను పెళ్లాడు," అన్నాడు లియొనాటో. మాట ఇచ్చిఉన్నాడు గనక క్లాడియో మారుమాటాడక అందుకు సమ్మతించాడు.

మర్నాడు ఉదయం మళ్లీ అందరూ చర్చిలో సమావేశమయారు. ఎవరూ గుర్తించకుండా ఉండగలందులకు హీరో ముసుగు వేసుకుని, పెళ్లితంతు అయాక దాన్ని తొలగించింది. క్లాడియో తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. "ఈమె చనిపోయిన హీరో కాదా?" అన్నాడతను.

"అప్రతిష్ఠ బతికి ఉన్నంతకాలం మాత్రమే ఆమె చనిపోయింది," అన్నాడు లియొనాటో.

ఇంతలోనే బెనెడిక్ అక్కడికి వచ్చి తనకూ, బియాట్రిస్‌కూ కూడా వివాహం చెయ్యమని పురోహితుణ్ణి అడిగాడు. బియాట్రిస్ ఈ పెళ్లికి వెంటనే సమ్మతించక అభ్యంతరం చెప్పబోయింది.

"ఎందుకీ నటన? నువు నన్ను ప్రేమిస్తున్నట్టు హీరో బయట పెట్టిందిలే!" అన్నాడు బెనెడిక్.

"నువే నన్ను ముందు ప్రేమించావు," అన్నది బియాట్రిస్.

ఈ ఘర్షణలో అసలు రహస్యం కాస్తా బయటపడింది.

ఇతరులు ఆడిన నాటకం మూలాన తాము ఒకరినొకరు ప్రేమించుకోవటం జరిగిందని తెలిసినాకకూడా వారు తమ మనసులు మార్చుకోలేదు. వారిద్దరూ అప్పుడే వివాహం చేసేసుకున్నారు. ఉట్టి పుణ్యానికి ఉప్పెనలాగా వచ్చిన కష్టాలన్నీ మంచు విచ్చినట్టు విచ్చిపోయాయి.






# అసమీక్ష్యకారిత్వము

విన్నది కన్నది - వివరింపకుండ
క్రన్నన చేయుట - కడు దోషమగును.
ఈ నీతి వివరింప - నెంచి పండితుడు
ఈ నీతి భాగమ్ము - నిటు వచియించె.

*  *  *

మును పాక పట్టణ-మ్మున సెట్టి యొకడు
తన సొమ్ము పోయి బీ-దతనమ్ము వొందె.
చాలదు పొట్టకే, - సంసార మీదు
టే లీల ? యని, విల-పించు నా సెట్టి.
రేయి నిద్దుర లేక-పోయె నుంతయును
ఈ యవస్థను దాటు - టెట్లని వగచె.
పేదతనమ్మన్న - పెను నరకమ్ము
ఈదుట మాటలా ? - ఎట్లని వగచె.
కొంతసేపటి కల్లె - కూర్కునువచ్చె
అంతలో ఒక కల - వింతగా తోచె.
ఒక జైనముని వచ్చి : - " ఓ సెట్టి నేను
సకల దారిద్ర్యమ్ము - సాగనంపెదను
పెద్దలు దాచిన - పెను ధనమ్మేను
మిద్దెలు మేడలు - మీకు సేకూర్తు.
రేపు ప్రొద్దున వత్తు - మీ పుణ్యగృహము
అపక నను చంపు - మగపడు ధనము."
అని కలలో జైను-డన్నంత లేచి
వినుటెల్ల నిజమొ, కా-దనుకొనవలెనొ
తెలియక ఆలోచ-నల మున్గియుండ
కలలోని ముని వచ్చె - తల బోడివాడు.
ఏమైన కానిమ్ము - టెంచి ఆ సెట్టి
స్వామిని బడితతో - బాదె నెత్తిపయి.
తటుకున బంగారు - తళతళలాడె,
అటు ముని పడియె స్వ-ర్ణాకారు డగుచు.
ఆలోన అట వచ్చి-నట్టి నాపితుడు
ఈ లీల గాంచి భే - షిది మంచిదనుచు
అప్పుడే జైన వి-హారాని కఱిగి
గొప్ప భక్తునివోలె - గురులకు మ్రొక్కె.
కలరట జైన భి-క్షులు చాలమంది
తల నేల మోపి వా-రల మెచ్చిమెచ్చి,
కొనివచ్చె తన యింటి-కిని వారినెల్ల,

విద్వాన్ విశ్వం



తనలోని ఆశ కొ-త్త చిగుళ్ళు వెట్టె.
లోనికి రానిచ్చి - జైనుల తలల
పూని వ్రయ్యలుచేసె - బొబ్బలువెట్టి.
ఆ దెబ్బతో కొంద - అటె చచ్చిపడిరి,
ఆ దెబ్బతో కొంద - అట గాయపడిరి.
హతశేషులెల్ల హా-హాకారములను
మతిసెడి వీథుల - గతి తప్పి చనిరి
పరువెత్తువారి, న-ల్గురు రాజభటులు
పరికించి, వివరమ్ము - సరగున నెఱిగి,
మంగలి యింటికి - చెంగున నెగిరి,
రంగము రక్త ధా-రాసిక్త మగుట
తిలకించి మంగలి - తెగడి పట్టుకొని
చలమున బంధించి - చనిరి చావడికి,

పెద్దమనుష్యుల-వద్దకు చేర్చి
ఇద్ది సంగతి యంచు - నెఱిగించినారు.
"ఏమిరా మంగలీ? - యిది యేటి నీతి?
సాముల నిటు జంప - నేమి కారణము?
తెలియ జెప్పు," మటంచు - పలికిరి వారు.
"తెలియక చేసితి - దేవరా, నేను,
సెట్టిగారింటిలో - నిట్టిది చూచి
ఇట్టె సంపాదింప - నిటు చేసినాడ!"
అని సెట్టి యింటిలో - తను జూచుటెల్ల
వినిపించె మంగలి - విశదమ్ముగాను.
సెట్టిని పిలిపించి - రిట్టె వారెల్ల
అట్టి వార్తను విని - అనిరి సభ్యులను
"చూచినదెల్ల నె-చ్చో చేయదగునె?
చూచి ఆలోచించి - వేచి చూడవలె,"
అని వాని ఉరివేయు-డని తీర్పు చెప్పి
వినువారితో వార - లని రిట్లు పిదప.

* * *

అల అధిష్ఠాన పు-రాంతరమందు
కలడొక్క విప్రుడు - కడుపేదవాడు.
నెలలు నిండిన వాని - కులపత్ని కొకట
కలిగె కుమారుడు; - కలదు వారింట
ముంగిస యొకటి; ఆ - పూటనే అదియు
ముంగి కూనను గని - ముగిసియేపోయె.
తన కొడుకునువోలె - తల్లి ఆ కూన
నెనరున పోషించు-చును వచ్చుచుండె.




ఒకసారి కొడుకును నా - ఉయ్యాలనుంచి
నకులమ్మువాని జో-లికి పోవునేమొ
కనిపెట్టమని భర్త-కును జెప్పి ఆమె
చనె నీళ్ళుతెచ్చుట-కని, అంతలోనె
భిక్షకు పోకున్న - పెను నష్టమంచు
అక్షయపాత్రతో - అరిగె బ్రాహ్మణుడు.
ఇంతలో పామొక్క - పెట్టులో వచ్చి
అంత పాపని జేర - నటు పోవసాగె
ముంగిస ఎగసి పా-మును చీల్చి చంపి
అంగణమ్మున నిల్చె - అమ్మకు చెప్ప.
బిందె తీసుకవచ్చి - ముందర ముంగి
తొందర చూచి, నె-త్తురు చార చూచి,
తన పాప నిది చంపె-నని, ఆమె బిందె
గొని, ముంగి చంపి, చె-క్కుల నీరు రాల
బిరబిర వచ్చి చం-పిన పాము జూచి,
మఱచి నిద్రించు కు-మారుని చూచి,
వలవల యేడ్చె పా-పము కట్టుకొంటి
తెలియక ముంగిని - పాలియించితి నని.
ఇంతలో బ్రాహ్మణు - డింటికి రాగ
అంతయు జెప్పె ఆ-యమ ఇట్టులనియె.

బ్రాహ్మణ భార్య :

అత్యాశతో పోతి - వంతలో నీవు,
సత్యమెఱుంగక - చంపితి దీని ;
కత చెప్పినట్లయ్యె - కడకు నీ ఆశ.
అతి లోభి తలపయి - నాడు చక్రమ్ము.

బ్రాహ్మణుడు :

అది యేమి కథ ? చెప్పు - మా విధమెల్ల.

బ్రాహ్మణి :

మొదటినుండి వచింతు - తుదిదాక వినుము.

*   *   *

కలరు నల్వురు బ్రాహ్మ-ణుల కుమారకులు,
తలకు మించిన పేద-తనము వారలది.
చేత దమ్మిడి లేక - జీవించలేక,
పీతీరునన్ గడి-యింపగాలేక,
సరివారిలో పేద-సంసార మీదు
నరకమ్ముకంటె వ-నస్థితి మేలు
ఎటులైన ధనము గ-డించియే కాని
ఇటులుండ తగదని - ఏగిరి వారు.
వనములు, వార్ధులు, - వాడలు గడచి



చనిచని ఆ అవం-తిని చేరినారు.
ఆ నగరమున సి-ప్రానది మునిగి
ఆ నగవాసి మ-హాకాళు కెఱగి,
వెలికివచ్చుచు సిద్ధు - తిలకించి వారు
కల వర్తమాన మే-కరువు పెట్టగనె
అతడు వీరల దీన-గతి తలపోసి
వెతమానుడని ఒక్క - విధమును చెప్పె.
సులువుగా ధనము వ-చ్చుట సిద్ధ విద్య
వలన సాధ్యమ్మని - వారికి చెప్పె
తన మంత్రఘుటిక లొ-క్కని కొకొక్కటిగ
నెనరున నిచ్చి యి-ట్లని చెప్పినాడు.
హిమవంతమున కేగి - నెమకు డచ్చోట
శ్రమలేక చిక్కు ధ-నము ; పోవు డిపుడె.
ఎచట నీ ఘుటి పడు - నచట త్రవ్వవలె.

పచియింతు దారిని, - వలను తప్పకుడు.
అని దారి వివరించి - చనెను సిద్ధుండు ;
మనవారు నల్వురు - చనిరి హిమాద్రి.
ఒకచోట నొకని ఘు-టిక నేలపడియె
చకచక త్రవ్వి, ర-చ్చట రాగి దొరికె.
కావలసిన రాగి - గైకొని పోద
మే వాడలో అమ్మి-నా వచ్చు ధనము
అని తొలివా డన - నవతలి మువ్వు
రును వినలేదు, ముం-దున కేగినారు.
రెండవ ఘుటిక జా-రిన దొక్కచోట;
ఉండెను త్రవ్వగా - వెండి కొల్లలుగ.
వాడందు నిలబడి - వచ్చిన వెండి
తోడుకపోద మ-న్నాడు—పాపమ్ము
మిగత యిర్వురు వాని - మీరి అన్నారు ;
నగుబాటు వెండికై - నవయుట యేల ?
అని వారు మునుముందు - కని చనినారు.
చనచన నింకొండు - సరి జారి పడియె.
అట త్రవ్వ బంగార - మగపడె, నొకడు
ఇటు దీని గొంపోద - మింటి కన్నాడు.
నాలవవాడది - చాలదన్నాడు.
"ఏల ఈ బంగార ? - మెన్ని రత్నాలొ
దొరకగావచ్చు, ముం-దర కేగినంత.
సరి రాగి వెండి బం-గరువులు దొరకె.
ఇక రత్నములెకదా - యిట చిక్కవలయు?
చకచక నే వెళ్ళి - సాధింతు వాని"
అనినంత మూడవా-తను నిల్చిపోయె.
చనె నాల్గవాతను - మునుముందు కంత.

# కవీ - కీర్తిదేవతా

కీర్తి దేవతను ప్రేమించిన ఒక కవి ఆమెకు అర్పించటానికని పద్యరత్నాలతో మాలలు తయారు చేశాడు. కాని కీర్తిదేవత అతన్ని లక్ష్యపెట్టకుండా, ఇతరులు వేసిన తుచ్ఛమైన మాలలు ధరించి ఉల్లాసంగా సందులూ, గొందులూ తిరగ సాగింది. ఆ మాలలు కొద్దిసేపట్లో వాడిపోయేవి, అధికారం సంపాదించిన అల్పులు ఆమె మెడలో వేసినవి.

కాని కవి తన పద్యరత్నాల మాలలను తయారుచేయటం మానలేదు. ఎప్పటికైనా వాటిని స్వీకరించి, వాటిని తన శాశ్వతాలంకారాలుగా ధరించటానికి కీర్తిదేవత వస్తుందని అతని నమ్మకం.

అయితే కీర్తిదేవత అతనికేసి చూడనైనా లేదు.

ఒకనాడు కవి ఆమెను సమీపించి, "నీకోసం శాశ్వతమైన మాలలు తయారుచేశాను. నా దగ్గిరికెందుకు రావు? వాటిని ఎందుకు ధరించవు?" అని అడిగాడు.

"మరో నూరేళ్లకు శ్మశానంలో నిన్ను కలుసుకుంటాను, తొందరపడకు!" అంటూ కీర్తిదేవత నిలవకుండా వెళ్లిపోయింది.



# బందిపోటు - సిద్ధముని



విసుగు చెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఇలా శ్రమ పడటం చూస్తే నాకు చాలా జాలివేస్తున్నది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక విచిత్రమైన నీతికథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కోసలదేశానికీ, కాశీదేశానికీ మధ్య ఉండే సరిహద్దులో కొందరు దోపిడిదార్లు ఉంటూండేవారు. వీరికి దొంగతనాలు అనాదిగా వస్తున్న వృత్తి. భూములు దున్నుకోవటమూ, ఇతర వృత్తులు చేసుకోవటమూ, జ్ఞానంవల్ల పొట్టపోసుకోవటమూ వారికి గౌరవ హీనంగా కనబడేది. అందుచేత వారు చదువులు చదివేవారు కారు, మడులూ మాన్యాలూ ఆశించేవారు కారు.

## బేతాళ కథలు



ఈ దోపిడి సార్లలో అగ్రగణ్యుడుగా చెప్ప దగినవాడు దుర్ముఖుడనేవాడు. అతనికి ఏడుగురు కుమారులుండేవారు. వారిలో ఆరుగురు దోపిడీలలోనే తమ ప్రాణాలు కోల్పోయారు. ఇప్పు డతనివెంట అతని ఆఖరు కొడుకు గంగు అనేవాడు మాత్రమే వుంటున్నాడు.

"నాయనా, గంగూ! భుజబలంపై ఆధార పడి బతకటం మనకు అనాదిగా వస్తున్న నీతి. కొయ్యలు చెక్కుకునీ, కుండలు చేసుకునీ, మట్టి తవ్వుకునీ బతికేవాళ్లు చాలా హీనజీవులు. నువ్వు వారిలాగా బతక నని నాకు మాట ఇయ్యి!" అని దుర్ముఖుడు కొడుకుతో అనేవాడు.

గంగుకూడా తండ్రికి తగ్గ కొడుకే. తండ్రి చేసే దోపిడీలలో గంగుకూడా తోడ్పడుతూ ఉండేవాడు.

దుర్ముఖుడికి ఒక చిన్న కోటలాటి ఇల్లున్నది. అది అజేయమైనది. దానికి ఒక పక్క ఊబి భూములుండేవి. మరొక పక్క దట్టమైన అరణ్యం ఉండేది. ఆ ఊబి భూములమధ్యగా వాళ్ల ఇంటిని సమీపిం చటం కొద్దిమంది సాటిదొంగలకు తప్ప కొత్తవారికి తెలియదు. ఆ ప్రదేశంలో దుర్ముఖుడు బలమైన ఇల్లు కట్టుకుని, దాని



చుట్టూ కొండరాళ్లతో ప్రహరీగోడ కట్టాడు. తన ఇంటికి లోహపు తలుపులు గల పెద్ద ద్వారం అమర్చాడు.

ఇంటికీ ప్రహరీగోడకూ మధ్య ఉన్న విశాలమైన ఖాళీప్రదేశంలో దుర్ముఖుడి పశువులూ గుర్రాలూ ఉండేవి.

ఇలా ఉండగా కోసలకు ముఖ్యపట్టణ మైన అయోధ్యలో రాజుగారు చనిపోయాడు. ఆయనకు పిల్లలు లేరు. ఆ కారణంచేత కాశీరాజే కోసలరాజ్యానికికూడా వారసు డయాడు. ఎన్నో శతాబ్దాలపాటు వేరువేరుగా ఉన్న రాజ్యాలు రెండూ యిందుపల్ల ఏకచ్ఛత్రంకిందికి వచ్చాయి. కాశీరాజు



సపరివారంగా అయోధ్యానగరానికి బయలుదేరి వచ్చి మహావైభవంగా రాజ్యాభిషేకం జరుపుకున్నాడు.

ఆరోజే సరిహద్దు దోపిడిదార్లు భారీఎత్తున దోపిడీలుకూడా చేశారు. అధికారులు వచ్చి రాజుగారితో, "మహారాజా, కాశీ కోసల సరిహద్దుపై దోపిడిదార్లు మళ్ళీ విజృంభించారు!" అని మనవిచేసుకున్నారు.

"ఇప్పుడు కాశీ కోసల దేశాలమధ్య సరిహద్దు లేదు. అది మన రాజ్యానికి నడిబొడ్డు. అక్కడ ఉండే దోపిడీదార్ల నందర్నీ నిర్మూలించండి!" అని రాజు తన సేనానాయకుడికి ఉత్తరువిచ్చాడు.



సేనానాయకుడు అయిదువందలమంది సైనికులతో బయలుదేరి సరిహద్దుకు వెళ్ళి దోపిడీదార్ల వేట ఆరంభించాడు. కొందరు దోపిడీదార్లు సేనానాయకుడి అభయం పొంది, లంచాలుకూడా తీసుకుని, మిగిలిన దోపిడిదార్లను వెతికి పట్టుకోవటానికి బాగా సహాయపడ్డారు. తనకు దొరికిన ప్రతి దోపిడీదారునూ సేనానాయకుడు ఎప్పటికప్పుడే తల తీయించేశాడు.

ఈవార్త దుర్ముఖుడికి తెలిసింది. అతను తన కొడుకుతో, "నాయనా, గంగూ! ప్రపంచం తారుమారు కాబోతున్నది. ఇక ధర్మమనేది ఉండదు. పరాక్రమవంతులు భుజబలంతో బతికే రోజులు పోయి, శాసనాలకు లోబడి బతికే రోజులు వస్తున్నాయి. బలపరాక్రమాల స్థానంలో పెత్తనం అధికారం చలాయించబోతున్నది. నువుమాత్రం ఎలాంటి పరిస్థితులలోనూ పౌరుషంగా బతుకుతానని మాట ఇయ్యి!" అన్నాడు.

తండ్రి కొడుకులు ఇంటి డాబామీద కూచుని మాట్లాడుకుంటున్న సమయంలో దూరాన మనుష్యులు గుర్రాలెక్కి తమ ఇంటికేసి రావటం కనిపించింది.

"నాన్నా, మన ఇంటిపైకి సైనికులు వస్తున్నారు," అన్నాడు గంగు.







" ఊబిమధ్యగా ఎలా వస్తార్రా? ఒక రిద్దరు మనుషులే దారితెలియకపోతే రాలేరే, సైన్యం ఎలా రాగలదు? నువ్వేమీ భయ పడకు," అన్నాడు దుర్ముఖుడు.

" కాదు, నాన్నా, వారికెవరో దారి చూపి స్తున్నారు. ముందుగా గుర్రంమీద వచ్చే వాడికి దారి బాగా తెలుసును. తాను ఫలానా అని తెలియకుండా ఉండటానికి ముసుగు వేసుకున్నాడు!" అన్నాడు గంగు.

" నీచు లెవరో నయవంచన చేశారు. నాయనా, నా బాణాలూ విల్లూ అందుకో!" అన్నాడు దుర్ముఖుడు.

సైనికులూ, సేనానాయకుడూ దుర్ముఖుడి ఇంటిని చుట్టుముట్టారు.

" అయ్యా, పేదవాణ్ణి! ఇంతమంది అతి థులు వస్తే నేనేంకావాలి. మీ గుర్రాలకు దాణా కూడా పెట్టలేనే!" అన్నాడు దుర్ముఖుడు సేనానాయకుడితో.

" బందిపోటు నాయకుడు దుర్ముఖుడు నీవే అయినట్టయితే వెంటనే నాకు బందీ అయిపో! లేకపోతే నిన్నూ, నీ ఇంటినీ, నీవాళ్లనూ సర్వనాశనం చేస్తాం!" అన్నాడు సేనానాయకుడు.

దుర్ముఖుడు సేనానాయకుడితో, " అయ్యా, నేను దొంగనుకాను. నేను చాటుమాటుగా ఏపనీ చెయ్యలేదు. పేదల కడుపు కొట్టలేదు, చాతనయినప్పుడల్లా వారిని ఆదుకున్నాను. అనాథస్త్రీలనూ, శిశువులనూ ఎన్నడూ హింసించలేదు. నన్ను మీరెందుకు లొంగిపొమ్మంటున్నారో నాకర్థం కాకుండా ఉన్నది!" అన్నాడు.

సేనానాయకుడీమాటలు వినిపించుకోక, ఇంటిచుట్టూ ఉన్న ప్రహరీగోడ బద్దలుకొట్ట మని తన సైనికులను ఆజ్ఞాపించాడు. అప్పటికే సూర్యాస్తమానమయింది. కొద్ది సేపట్లో చీకటి పడబోతున్నది.

సైనికులు గోడ ఒకభాగం పడగొట్టే సమ యానికి గంగు ఇంటిపైనుంచి పశువుల



మధ్యకు చెత్తకట్టలు అంటించి పడవేశాడు. ఆ మంటలకు బెదిరి పశువులన్నీ, సైనికుల మీదికి పరిగెత్తి కలవరం కలిగించాయి.

ఈసమయంలో దుర్ముఖుడు గంగుతో సహా కిందికి దిగివచ్చాడు. తన భార్యకూ, కొడుకుకూ వీడ్కోలు చెప్పాడు. "మీరు మానుషంగామాత్రం బతకండి. నేను సాధ్యమైనంతవరకు ప్రాణాలతో తప్పించుకుంటాను. బతికి బయటపడ్డానంటే మళ్లీ మనం ఎప్పటికైనా కలుసుకుంటాం. లేకపోతే ఇదే ఆఖరిచూపు!" అంటూ దుర్ముఖుడు ప్రఖ్యాతమైన తన గండ్రగొడ్డలి తీసుకుని, గంగుతో, "నాయనా, చప్పుడు కాకుండా మెల్లగా తలుపు తెరు. నేను బయటికి పోతాను," అన్నాడు.

ఇంటిబయట చేరిన సైనికులు, "బయటికి వస్తారా? కొంపకు నిప్పంటించమా?" అని కేకలు వేస్తూ ఉన్నసమయంలో అకస్మాత్తుగా తలుపు తెరుచుకున్నది. గండ్రగొడ్డలి గుండ్రగా తిప్పుతూ శరవేగంతో దుర్ముఖుడు సైనికులమధ్యగా దూసుకువచ్చాడు. అతన్ని ఎవరూ ఆపలేకపోయారు. పైపెచ్చు అతని గండ్రగొడ్డలి అడ్డం వచ్చినవారిని ఊచకోత కోసేసింది.

సైనికులను దాటినాక దుర్ముఖుడు ఊటికి అడ్డంపడి అరణ్యంకేసి పరిగెత్తాడు.



కొందరు అశ్వసైనికులు అతన్ని చీకటిలో వెంబడించారు. వారిలో ఒక్కడుకూడా ప్రాణాలతో తిరిగిరాలేదు; అందరూ ఊబిలో దిగబడిపోయారు.

దుర్ముఖుడు మాత్రం సురక్షితంగా తప్పించుకు పారిపోయాడు.

ఈలోపల సైనికులు దుర్ముఖుడి ఇంట జొరబడ్డారు. లోపల గాఢాంధకారంగా ఉంది. సైనికులకు ఊబి మధ్యగా దారి చూపిన ముసుగుమనిషి ఎక్కడినుంచో ఒక దివిటీ తెచ్చాడు. తలుపు పక్కన నిలబడి చూస్తున్న గంగుకు మండిపోయింది. వాడు తలుపువెనక గోడనుంచి తన గండ్రగొడ్డలి తీసి ఆ ముసుగుమనిషి చేతిమీద ఒక పెట్టు పెట్టాడు. ఆ దెబ్బకు దివిటీ కింద పడి ఆరి పోవటమే కాక, ముసుగుమనిషి చేతివేళ్లు మూడు తెగిపోయాయి.

చివరకు సైనికులు దుర్ముఖుడి భార్యనూ, కొడుకునూ ఖైదీలుగా పట్టుకుని, దుర్ముఖుడి ఇంటికి నిప్పుపెట్టి కాల్చివేసి, అయోధ్యకు తిరిగి వచ్చారు.

అక్కడ న్యాయస్థానంలో దుర్ముఖుడి భార్యకుగాని, గంగుకుగాని ఎట్టి శిక్ష పడలేదు. "డేగ ఎగిరిపోయాక, ఈ పిచ్చికలను ఎందుకు పట్టుకువచ్చినట్టు?" అన్నాడు న్యాయాధికారి.





"నా భర్తను పొట్టన పెట్టుకున్నారు, నా కొంపకు చిచ్చుపెట్టారు! ఇప్పుడు మనం ఎక్కడికి పోయేటట్టు?" అని దుర్ముఖుడి భార్య ఏడ్చింది.

"నేను మళ్లీ ఇల్లు కడతాను, రా అమ్మా!" అంటూ గంగు తన తల్లిని తీసుకుని తన ఇల్లున్న చోటికి వచ్చాడు. అక్కడ తల్లీ కొడుకు లిద్దరూ ఒక కుటీరం కట్టుకున్నారు. కాని తినటానికి తిండిలేదు. కుందేళ్లవంటి చిన్నచిన్న జంతువులను గంగు వేటాడి తెచ్చాడు. తరవాత రెండు మూడు రోజులకు గంగు తల్లి మంచాన పడి, వారం రోజుల కల్లా మరణించింది. గంగు బొత్తిగా దిక్కు



లేనివాడైపోయాడు. వాడు తన తల్లిని ఇంటి సమీపంలోనే పాతిపెట్టాడు.

గంగు పరిస్థితి అందరికీ తెలిసింది. ఆ సమీపంలోనే నివసిస్తున్న ఒక సంపన్నుడు గంగుపైన జాలిపడి, తన పశువుల కాపరిగా ఉద్యోగం ఇచ్చాడు.

గంగు జీవితం పూర్తిగా మారిపోయింది. దానితోబాటు వాడి మనస్తత్వంకూడా మారిపోయింది. కాని అప్పుడప్పుడూ తమ శత్రువుపైన పగ తీర్చుకోవాలన్న ఉద్రేకం కలుగుతూ ఉండేది. ఆనాడు సైనికులను తమ ఇంటికి తీసుకువచ్చిన ముసుగుమనిషి ఎవరో గంగుకు ఇప్పుడు తెలుసును. వాడి పేరు రుద్రుడు. వాడి ఇల్లు దుర్ముఖుడి ఇంటికి కొద్దిదూరంలోనే ఉన్నది. వాడి కుడిచేతికి రెండే వేళ్లు ఉన్నాయి.

రుద్రుణ్ణి చూసినప్పుడల్లా గంగు రక్తం ఉడికిపోయేది, కాని గంగు తొందరపడి ఏమీ చెయ్యలేదు.

చాలా ఏళ్లు గడిచాయి. గంగు పాతికేళ్ల వయసులో ఉండగా ఏదో ఉత్సవం వచ్చింది. యువకులు వినోదపు పోటీలో మల్లయుద్ధాలు చేశారు. గంగూ, రుద్రుడూ మల్లయుద్ధం చెయ్యవలసివచ్చింది. గంగు కిందా, తాను మీదా అయిఉన్న సమయంలో రుద్రుడు





ఎక్కడినుంచో ఒక కత్తి తీసి గంగు డొక్కలో పొడిచాడు. మళ్లీ పొడవటానికి చెయ్యి ఎత్తినప్పుడు గంగు వాడి చెయ్యి పట్టుకుని కత్తి లాగేసి రుద్రుడి రొమ్ములో పొడిచాడు. మరుక్షణం గంగు హడలిపోయాడు. ఈ తప్పు చేసినందుకు నలుగురూ చేరి తనను హతమార్చేస్తారని రూఢి చేసుకుని వాడు అక్కడినుంచి కాలిబలంకొద్దీ అడవిలోకి పరిగెత్తిపోయాడు.

వాడు రాత్రింబగళ్లు ఆగకుండా ప్రయాణంచేసి కొంత కాలానికి ఒక దూర దేశం చేరుకుని ఒక సత్రంలో బసచేశాడు. ఆ రోజే అక్కడికి ఒక ముసలి బిచ్చగాడు కూడా వచ్చాడు. ఆ బిచ్చగాడు తనకేసి పరీక్షగా చూస్తూ ఉండటం గమనించి గంగు చిరాకుపడ్డాడు.

మర్నాడు గంగు ప్రయాణమవుతుండగా ఆ బిచ్చగాడు వెంట నడవసాగాడు.

"ఎవరు నువ్వు? నాతో ఏం పని?" అని గంగు బిచ్చగాణ్ణి అడిగాడు.

"నువ్వు దక్షిణదేశం పోతున్నట్టున్నావు. నేనూ అటే పోతున్నాను. మనిషికి మనిషి తోడుగదా! ఇంతకూ, బాబూ, నీ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాడు బిచ్చగాడు.

"నాపేరు గంగు!" అన్నాడు గంగు.



"మీ నాన్న పేరు?" అని బిచ్చగాడు మళ్లీ అడిగాడు.

గంగు సమాధానం చెప్పినమీదట ఆ బిచ్చగాడు వాణ్ణి కౌగలించుకుని, "నేను నీ తండ్రినేరా, నాయనా! మీ అమ్మ కులాసాగా ఉన్నదా? నువు ఎక్కడికి పోతున్నావు? ఎందుకు పోతున్నావు?" అని అడిగాడు.

గంగు తండ్రికి తన సమాచారమంతా వివరంగా చెప్పాడు.

"ఈ మాత్రానికే పారిపోతున్నావా, నాయనా? అక్కర్లేదు. మనదగ్గిర ఏ అన్యాయాలనైనా సరిచేయగల బంగారం

ఉన్నది: నేను నానా దేశాలూ తిరిగి, సైనికుడుగా పనిచేసి చాలా సంపాదించి కూడబెట్టాను. దగ్గిర చాలా డబ్బున్నదని ఎవరూ అనుకోకుండా ఈ బిచ్చగాడివేషం వేశాను. ఇంటికి పోదాంపద!" అన్నాడు దుర్ముఖుడు.

అంతా దుర్ముఖుడు చెప్పినట్టే జరిగింది. గంగు పొడిచిన పోటుకు రుద్రుడు చావలేదు. అధికారులు కొద్ది బంగారుకాసులు లంచం పుచ్చుకుని రుద్రుడు గంగుపై చేసిన ఫిర్యాదుకు సాక్ష్యాధారం లేదు పొమ్మన్నారు. దుర్ముఖుడు చాలా ధనంతో తిరిగి వచ్చాడని తెలిసి గొప్పగొప్పవాళ్లుకూడా అతనితో స్నేహం చేశారు. గంగును పశువుల కాపరిగా పెట్టుకున్న ధనికుడే వాడికి తన కుమార్తెనిచ్చి వైభవంగా పెళ్లిచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. తనదృష్టిలో ఉత్తమమానవుడుగా జీవిస్తున్నా ననుకున్నప్పుడు అధికారులు దుర్ముఖుణ్ణి ఎందుకు నేరస్థుడుగా చూశారు, అతను తరవాత డబ్బు సంపాదించి న్యాయం కళ్లుకూడా కప్పగలిగితే అతన్ని పెద్దమనిషిగా లోకం ఎందుకు భావించింది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"ఒక మనిషి తాను నీతిగా ప్రవర్తిస్తున్నా ననుకున్నందువల్ల ఏమీ లాభంలేదు. సంఘ నీతిలో మార్పులు జరిగినప్పుడు మనుషులు కూడా దానికి అనుగుణంగా తమ ప్రవర్తనను మార్చుకోవాలి. దొంగగా ఉన్నప్పుడు దుర్ముఖుడు తన తాత ముత్తాతలనాటి సంఘ నీతిని మాత్రమే పాటించాడు, ధనంతో తిరిగి వచ్చినాక ఆనాడు అమలులో ఉన్న సంఘ నీతిని పాటించాడు. అందుచేతనే ఒకనాటి దొంగ పెద్దమనిషి అయాడు!" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






"అదేం పనిరా?"
"చెట్లకు నీళ్లు పొయ్యి
మన్నావుగా."



"బాగా మునిగి స్నానం చెయ్యి,
నాయనా! నీమీద వాన పడకుండా
నేను చూస్తాలే,"




కుర్రాడు: (గుడ్డిమనిషితో) తాత
గారూ, అది చీకటి కొట్టు, నేను
టార్చివేస్తాను. కొంచెంఆగండి."




"ఈ కాలవను ఒక్కసారిగా దూకేస్తాను"
"వద్దు. కాలవ చాలా వెడల్పు.
అందుకని రెండుసార్లుగా దూకు."



# దక్షిణ ధ్రువ ప్రాంతపు వింతలు



భూగోళానికి ఉత్తర దక్షిణ ధృవాలున్న సంగతి మనకందరికీ తెలుసు. ఉత్తర ధృవం ఉండే చోట సముద్రంమాత్రమే ఉన్నది, కాని దక్షిణ ధృవప్రాంతంలో ఒక పెద్ద ఖండం ఉన్నది. దాని వైశాల్యం దక్షిణ అమెరికా ఖండంకంటె కొద్దిగా తక్కువ—62 లక్షల చదరపు మైళ్లు. అయితే ఈ ఖండం గురించి మనుషులకు దాదాపు ఏమీ తెలియదు. దీన్ని కనిపెట్టి సుమారు నూరేళ్లుమాత్రమే అయింది. ఇది ఎల్లప్పుడూ మంచుకింద ఉండటంవల్ల మనుషులకుగాని, ఇతర జంతువులకుగాని వాసయోగ్యం కాదు. అంటార్కటికా అని పిలవబడే ఈ ఖండం తీరాలలో గడచిన నూరేళ్ల కాలంలో 600 మందికూడా నివసించలేదు. అంటార్కటికా తీరం నిడివి సుమారు 16000 మైళ్లు.

అంటార్కటికా ఖండంగురించి అనేక మంది బ్రిటిషు, ఆస్ట్రేలియను, అమెరికను, రష్యను, ఫ్రెంచి అన్వేషకులు గొప్ప పరిశోధనలు చేశారు. వారిలో కొందరు ఈ అన్వేషణలో తమ ప్రాణాలు కోల్పోయారు. శాస్త్రవిజ్ఞానమూ, ఉపకరణాలూ అభివృద్ధి చెందినకొద్దీ ఈ పరిశోధనలు ఫలవంతమవుతున్నాయి. ప్రస్తుతం నడిచే భూస్వరూప వైజ్ఞానిక పరిశోధనలో అన్నిదేశాల శాస్త్రవేత్తలూ అనేక శాస్త్రరంగాలలో కొత్త పరిశోధనలు జరుపుతున్నారు; ఈ సందర్భంలో అంటార్కటికా పరిశోధనలలోకూడా రష్యా, అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు మొదలైన దేశాలు పాల్గొంటున్నాయి. ఈ పరిశోధనల ఫలితంగా మనకు ముందు ముందు దక్షిణ ధృవప్రాంతం గురించి ఎన్నో అద్భుతాలు తెలుస్తాయి. ప్రస్తుతం మనం, 1947 లో అడ్మిరల్ బర్డ్ అనే అమెరికను అన్వేషకుడి నాయకత్వంకింద సాగిన పరిశోధనాంశాలను గురించి తెలుసుకుందాం :

## అడ్మిరల్ బర్డ్ పరిశోధనలు



బర్డ్ అంటార్క్టికాకు పెద్ద సన్నాహంతో బయలుదేరాడు. ఈయన లోగడ అంటార్క్టికాకు అనేక పర్యాయాలు వెళ్లి అన్వేషణలు సాగించటమే గాక 1940 లో మొదటిసారిగా దక్షిణ ధృవం మీదుగా విమానంలో ఎగిరినవాడు. ఈసారి ఈయన వెంట 13 నౌకలూ, 4000 మంది మనుషులూ, అంతులేని పరిశోధనోపకరణాలూ, నీటిపైనా మంచులోనూ వాలగల విమానాలూ ఉన్నాయి. నౌకలలో రెండు హిమవిచ్ఛేద నౌకలు ; అవి మందమైన మంచుగుట్టలను చీల్చుకుంటూ సముద్రంలో వెళ్లగలవు. విమానాలలోనుంచి కిందఉండే ప్రాంతాన్ని ఫొటోగ్రాఫు చెయ్యటానికి ప్రత్యేకమైన కామెరాలున్నాయి. ధృవప్రాంతంలో జరప వలిసిన వాతావరణ, ఖనిజాది పరిశోధనలు జరపటానికి సమర్థులైన శాస్త్రవేత్తలున్నారు. వారందరూ దక్షిణధృవ పర్యటనలకు అల వాటు పడినవారు.

బర్డ్ వెంట ఉన్నవారు మూడు శాఖలుగా విభజించబడ్డారు. రెండు దళాలు అంటార్క్టికా తూర్పు, పడమటి తీరాలను గురించి పరిశోధించటానికి ప్రత్యేకించ బడ్డాయి. ఎందుచేతనంటే ఈ తీరంయొక్క విస్పష్టమైన స్వరూపం ఎవరికీ తెలియదు.



ఖండమంతా అనేకవందల అడుగుల ఎత్తున మంచుతో కప్పబడి ఉంటుంది. ఆ మంచు పలకలు భూమిని దాటి సముద్రంలోకి చొచ్చుకుని వస్తాయి. ఈ ఖండం చుట్టూ ఉండే సముద్రంకూడా చాలావరకు మంచు కప్పి ఉంటుంది ; సముద్రపు మంచు ఎక్కడ ప్రారంభమయేదీ, భూమిపై మంచు ఎక్కడ అంతమయేదీ నిర్ణయించటం చాలాకష్టం.

మూడవ దళం అంటార్క్టికా అంతటా పర్యటించి, దాని మధ్యను ఉన్న పీఠ భూమిని అన్వేషించి, ఫొటోలు తీసి పరి శోధనలు సాగించవలిసినది. దీనికి బర్డ్





స్వయంగా నాయకత్వం వహించాడు. ఈ దళానికి నాలుగు నౌకలూ, ఒక హిమవిచ్ఛేద నౌకా, గుడారాలు అమర్చటానికి అవసరమైన సామగ్రీ మొదలైనవి ఉన్నాయి. ఈ దళం 1946 డిసెంబరు 31 న స్కాట్‌దీవిని చేరుకున్నది. (కాప్టెన్ రాబర్ట్ స్కాట్ అనే సుప్రసిద్ధ అన్వేషకుడు చాలా కాలంక్రితం దక్షిణ ధ్రువానికి కాలినడకను ప్రయాణమై పోతూ మరణించాడు.)

ఈ స్కాట్‌దీవికి 300 మైళ్ల దూరంలో ఎక్కడా భూమిఅన్నది లేదు. ఇది సముద్రంలోనుంచి చొచ్చుకువచ్చిన నల్ల రాయి. ఇక్కడి సముద్రంలో రెండు పర్వతా



లున్నాయి. అవి రెండూ రెండేసి మైళ్లు ఎత్తుగలవి. అందులో ఒకదాని శిఖరం స్కాట్‌దీవి. రెండవ పర్వతం శిఖరం నీటి మట్టానికి 200 అడుగులు దిగువగా ఉన్నది. బర్డ్ చేసిన మొట్టమొదటి పరిశోధన ఇదే.

స్కాట్‌దీవికీ అంటార్క్‌టికా ఖండానికీ మధ్యఉండే సముద్రాన్ని రాస్‌సముద్రం అంటారు. 1841 లో సర్ జేమ్స్‌క్లార్క్‌రాస్ అనే ఆయన నౌకలతో ఈ సముద్రంలో ప్రయాణించాడు. వేసవిలో—సూర్యుడు దక్షిణాయనంలో ఉన్నప్పుడు—ఈ సముద్రంలో 700 మైళ్ల మేర మంచు మూసుకోకుండా ఉంటుంది. ఆ సమయంలో మంచుగుట్టలు విడివిడిగా తేలుతుంటాయి. వీటిని దాటిపోతే మంచు లేని సముద్రం కనిపిస్తుంది. ఈ నీరు పోయిపోయి ఒక బ్రహ్మాండమైన మంచుగోడవద్ద నిలిచి పోతుంది. ఈ మంచుగోడ 40 మొదలుకొని 80 అడుగుల ఎత్తుదాకా ఉంటుంది. ఈ గోడ వెనకగా ఒక విస్తృతమైన మంచు పలక దక్షిణ ధ్రువ పీఠభూమిదాకా వ్యాపించి ఉంటుంది.

1947 జనవరి ఒకటిన ఈ దళం రాస్ సముద్రంలో ప్రయాణం ప్రారంభించింది. "నార్త్‌విండ్" అనే హిమవిచ్ఛేదనౌక





మంచుగుట్టలను చీల్చుకుంటూ ముందు పోతుంటే మిగిలిన నౌకలు దానివెంట కదిలాయి.

మొదట ఈ మంచుగుట్టలు పలచగానూ, మెత్తగానూ ఉండి నౌకలకు దారి ఇచ్చాయి. ఒక మంచుగుట్టల వరసకూ రెండవదానికీ మధ్య నీరుకూడా ఉండింది. కాని కొంత దూరం వెళ్లాక గాలిలో మార్పు జరిగి నౌకల చుట్టూ ఉన్న సముద్రం ఎటు చూసినా కనుచూపుమేరవరకూ తెల్లగా కరుడు కట్టుకుపోయింది!

స్కాట్ దీవినుంచి తిమింగలాల సముద్రశాఖకు 800 మైళ్లు. 1933లో బర్డ్ ఈ సముద్రాన్ని దాటినప్పుడు ఆయన కెక్కడా ఒక్క మంచుగుట్ట తగలలేదు. తిరిగి 1940లో ఆయన ఈ 800 మైళ్ల దూరాన్ని 24 గంటలలో దాటాడు. కాని ఈసారి వీరికి ఈ ప్రయాణం 15 రోజులు పట్టింది! నౌకల చుట్టూ సముద్రం ఎంత గట్టిగా పేరుకున్నదంటే ఒక్కొక్కరోజు వారు రెండు మూడు మైళ్లకన్న ముందుకు పోలేకపోయారు.

ఈ పదిహేను రోజులలో మూడు రోజులు ముందుకు పోవటానికి బదులు నౌకలు వెనక్కుకూడా వెళ్లాయి—మంచు వాటిని రోజుకు 6 మైళ్ల చొప్పున వెనక్కు నెట్టింది!



"నార్త్‌విండ్" 6,660 టన్నుల బరువు గలది; అది 3 అడుగుల మంచుకుండా అవలీలగా ప్రయాణించగలదు, 30 అడుగుల మంచుగోడను ఒకగంట లోపుగా నిర్మూలించగలదు.

కాని మంచు అన్నివైపుల నుంచీ నొక్కుతూ ఉండటంచేత "నార్త్‌విండ్" ఛేదించిన మంచు, మిగిలిన నౌకలు దాటేలోపుగా మళ్లీ కమ్ముకుంటూ వచ్చింది. ఈ కారణంగా ఈ ప్రయాణంలో నౌకలన్నీ సొట్టలు పడ్డాయి. గంట గంటకూ హెలికోప్టర్‌ను గాలిలోకి పంపి, నీరు ఎక్కడైనా కనిపిస్తుందేమోనని చూశారు. ఎక్కడా నీటి జాడ లేకపోయింది. పదిహేనవరోజున వారు మంచునుంచి విముక్తులై సముద్రంలోకి ప్రవేశించేసరికి "రాస్ మంచుగోడ" ఎట్ట ఎదట కనిపించింది.

ఈ మంచుగోడలోనుంచి తిమింగిలాల సముద్రశాఖకు దారి ఉన్నది. 1940లో బర్డ్ ఇటుగా వచ్చినప్పుడు ఆ దారి నిడివి ఒకటిన్నరమైళ్లు ఉండింది; ఇప్పుడది 300 గజాలుమాత్రమే ఉన్నది. అంటార్క్‌టికాకు నౌకలలో ప్రయాణమై వచ్చేవారికి తిమింగిలాల శాఖను మించిన రేవు ఉండదు. ఇక్కడ నౌకలకు లంగరు వేయటానికి సౌకర్యంగా ఉంటుంది. ఈ తీరాన విమానాలను దించినట్టయితే అవి సులువుగా దక్షిణ ధృవానికి వెళ్లిరాగలవు.

సముద్రశాఖను చూసి రావటానికి హెలికోప్టర్ వెళ్లింది. రెండున్నర చదరపుమైళ్ల మినహాగా మిగిలిన సముద్రశాఖ యావత్తూ 8 మొదలు 15 లేక 20 అడుగుల ఎత్తు వరకూ మంచు పేరుకుని ఉన్నట్టు తెలిసింది. "నార్త్‌విండ్" మూడురోజుల పాటు ఒకటిన్నర కోట్ల టన్నుల మంచు పగలగొట్టినమీదట మిగిలిన నౌకలు తిమింగిలాల శాఖలోని రేవును చేరగలిగాయి.

—(ఇంకా ఉంది)






# అహింసాజ్యోతి

## [4]

సిద్ధార్థుడు ఉరువేలవనంలో తపస్సుచేస్తున్న కాలంలో అయిదుగురు బ్రాహ్మణులు—కౌండిన్యుడు, భద్రాజీ, వప్రుడూ, మహనముడూ, అశ్వాజీ అనేవారు—అతను బుద్ధత్వం పొందటానికి తపస్సు చేస్తున్నట్టు తెలుసుకుని, అతని దగ్గిర చేరి శుశ్రూషలు చేస్తూ, "ఇతను తప్పక రేపటికి బుద్ధుడవుతాడు!" అని రోజూ గొంతెమ్మ కోరికలు కోరసాగారు. వారి శుశ్రూషలమూలంగా సిద్ధార్థుడికి సుఖంగా జరిగిపోసాగింది.

"తపస్సు చేసుకునేవాడికి సుఖాలు పనికిరావు. శరీరం తపించినప్పుడే తపస్సు సిద్ధిస్తుంది. తపస్సు ఎంత కఠోరంగా ఉంటే అంత త్వరగా సిద్ధిస్తుంది. మనిషికి ఆవగింజంత ఆహారమైనా చాలును!" అనుకుని సిద్ధార్థుడు ఉపవాసాలు చేస్తూ తపస్సు సాగించాడు.

ఈ ఉపవాసాలవల్ల బంగారు చాయ గల సిద్ధార్థుడి శరీరం శుష్కించి నల్లగా అయిపోయింది. అతని శరీరంపైన ఉండే ముప్పై రెండు శుభలక్షణాలూ కానరాకుండా పోయాయి. ఎంతో బలాఢ్యుడై ఉండికూడా ఇప్పుడు లేచి నిలబడలేని స్థితికి వచ్చాడు. అతని డొక్క వెన్నుకు అంటుకుపోయింది. ఒకనాటి రాత్రి మూడవ జామున అతను శోష వచ్చి, స్పృహతప్పి పడిపోయాడు.

"పాపం, మహారాజుల బిడ్డ! బుద్ధత్వం సాధిస్తానని తపస్సు ప్రారంభించి తపస్సు



ఫలించక ప్రాణాలు పోగొట్టుకున్నాడు!" అన్నారు వనంలో ఉండే ఇతర తాపసులు.

త్వరలోనే సిద్ధార్థుడు మరణించాడన్న వార్త కపిలవస్తునగరందాకా వెళ్ళింది; అయితే శుద్ధోదనమహారాజు నమ్మలేదు. తన కుమారుడు చక్రవర్తి కాలేదు, గనక బుద్ధుడు అయితీరుతాడని ఆయన నమ్మకం.

నిజానికి సిద్ధార్థుడు చావలేదు. అతను స్పృహ రాగానే భిక్షాపాత్ర తీసుకుని మళ్లీ బయలుదేరాడు. మేరుపర్వతాన్ని పెకలించటం ఎంత అసాధ్యమో, ఉపవాసాలతో బుద్ధత్వం సంపాదించటం అంత అసాధ్యమని అతనికి తోచిపోయింది. అతను మళ్లీ భోజనం చేయనారంభించగానే శుష్కించిన శరీరం మళ్లీ కండపెట్టింది. అతని శుభలక్షణాలన్నీ శరీరంలో యథాప్రకారం కనిపించాయి.

అయితే అతనికి శుశ్రూష చేసిన బ్రాహ్మణులు మటుకు, "ఈ తాపసి ఆరేళ్లు కఠోర తపస్సు చేసికూడా బుద్ధత్వం సంపాదించలేకపోయాడు. మళ్లీ కడుపునిండా తిననారంభించాడు!" అనుకుని, తమ కమండలాలూ, కౌపీనాలూ తీసుకుని వెళ్లిపోయారు.

ఆ రోజుల్లో ఉరువేలవనం సమీపంలో సేనాని అనే ఒక ఉత్తమ క్షత్రియుడు ఒక గ్రామంలో ఉండేవాడు. ఆ గ్రామం పేరు



కూడా సేనానే. ఆయనకు సుజాత అని ఒక కుమార్తె ఉండేది. తనకు ఉత్తమ వంశానికి చెందిన భర్త లభించి, తొలి సంతానం మగబిడ్డ పుట్టినట్టయితే అజాపాల దేవుడికి ఏటా పరమాన్నం నైవేద్యం పెడతానని ఆమె మొక్కుకున్నది.

ఈ అజాపాలదేవుడు ఒక నుగవృక్షంలో ఉండేవాడని ప్రతీతి.

సుజాత కోరుకున్నట్టుగానే ఆమెకు కాశీలో ఉండే ఒక ఉత్తమ క్షత్రియుడు భర్తగా లభించాడు, త్వరలోనే ఆమె ఒక మగపిల్లవాణ్ణికూడా కన్నది. అందుచేత ఆమె వైశాఖపూర్ణిమనాడు చిక్కని ఆవు పాలతో పరమాన్నం వండి, దేవుడి చెట్టు దగ్గిర ఊడ్చి శుభ్రంచేసి రమ్మని తన దాసిన అయిన పూర్ణ అనేదాన్ని పంపింది.

పూర్ణ చెట్టువద్దకు వచ్చేసరికి సిద్ధార్థుడు అదే చెట్టుకింద కూర్చుని ఉన్నాడు. అతని శరీరంలోనుంచి వెలువడే తేజస్సు చూసి పూర్ణ, ఆయనే దేవుడనుకుని, ఇంటికి పరిగెత్తిపోయి సుజాతతో, "అమ్మా, నీ నైవేద్యం తీసుకోవటానికి అజాపాలదేవుడు స్వయంగా వచ్చి చెట్టుకింద కూచున్నాడు!" అన్నది.

ఈ మాట విని సంతోషించి సుజాత, "ఇదే నిజమైతే నిన్ను నా కూతురుగా పెంచుకుని, మంచి మంచి నగలు పెడ







తానే!" అన్నది పూర్ణతో. తరవాత ఆమె మేలైన దుస్తులు ధరించి, తనకున్న విలవైన నగలన్నీ పెట్టుకుని, ఒక బంగారు పాత్రలో పరమాన్నం తీసుకుని, తన దాసీలందరూ వెంట రాగా, చెట్టువద్దకు వెళ్లింది. సిద్ధార్థుణ్ణి చూడగానే ఆమె పరమానందం చెందింది. ఆమె పరమాన్నం అతనిముందు పెట్టి, "నా కోరిక సిద్ధించింది; అలాగే మీ కోరిక కూడా సిద్ధించుగాక!" అన్నది.

సిద్ధార్థుడు పరమాన్నం ఆరగించినాక ఆయన చేతులు కడుక్కొవటానికి సుగంధ జలం ఇచ్చి సుజాత తన ఇంటికి తిరిగి పోయింది. సిద్ధార్థుడుకూడా అక్కడినుంచి కదిలి నీరంజర అనే నది వద్దకు వెళ్లాడు; సుప్రతిష్ఠితమనే చోట స్నానంచేశాడు. తరవాత అతను ఆ నది ఒడ్డునే ఉన్న ఒక అరణ్యం ప్రవేశించి పగలల్లా ఒక సాల వృక్షంకింద కూచున్నాడు.

చీకటి పడగానే సిద్ధార్థుడు సాలవృక్షం కిందనుంచి లేచి ఒక రావిచెట్టుకేసి నడవ సాగాడు. దారిలో అతనికి ఒక బ్రాహ్మడు ఎదురుపడి ఎనిమిది దర్భకట్ట లిచ్చాడు. సిద్ధార్థుడు రావిచెట్టు నాలుగువైపులా చూసి తూర్పువైపునే సమప్రదేశం ఉండటం గమనించాడు. అక్కడ అతను దర్భలు ఆసనంగా పరుచుకుని వాటిపైన కూచున్నాడు.

సిద్ధార్థుడు బుద్ధత్వం సాధించే ఘడియలు దగ్గిరపడుతూఉండటం గుర్తించి మన్మథుడు అతని మనస్సును చలింపజేయ నిశ్చయించాడు. గడిచిన ఆరేళ్లూ మన్మథుడు ఈ పనిమీదనే ఉన్నాడు. కాని అతని ప్రయత్నాలు ఫలించలేదు; అందుచేత ఈసారి విశ్వప్రయత్నం చేద్దామనుకున్నాడు. అయన తన పరివారాన్ని వెంటబెట్టుకుని, అనేకవందల ఆయుధాలు తీసుకుని యుద్ధానికి వెళ్లేవాడిలాగా బయలుదేరాడు. మన్మథుడి అనుచరులందరూ భయంకరమైన వన్యమృగాల రూపాలు ధరించారు.



సిద్ధార్థుడు ఆ సైన్యాన్ని చూసి, "నన్ను ఒక్కణ్ణి ఓడించటానికి ఇంత పెద్ద సైన్యం వస్తున్నది. ఇప్పుడు నన్ను రక్షించే తండ్రీ, అన్నలూ, మిత్రులూ, బంధువులూ ఎవరూ లేరు. నేను యింతకాలంగా విడవకుండా ఆచరించిన ధర్మాలు మాత్రమే నాకు రక్ష!" అనుకున్నాడు.

మన్మథుడు సిద్ధార్థుడి వెనుకనుంచి బోధి వృక్షాన్ని సమీపించబోయాడు కాని అది సాధ్యంకాలేదు. ఆయన ఒక ప్రచండ మారుతాన్ని సృష్టించాడు. ఆ గాలికి ఎంతెంత చెట్లూ విరిగి పడిపోయాయి; కొండ రాళ్లుసయితం కొట్టుకుపోయాయి, కాని రావి చెట్టు ఆకు ఒక్కటికూడా కదలలేదు; సిద్ధార్థుడి ఉత్తరీయం అంచుకూడా ఆ గాలికి ఆడలేదు. ఆ గాలి సిద్ధార్థుడికి మలయమారుతంలాగా మాత్రమే సోకింది.

ఇది చూసి మన్మథుడు మండిపడి అనేక వేల కాలమేఘాలను రప్పించాడు. అవి భీకరంగా ఉరిమి, ఏనుగుతొండాలంత ధారలతో వర్షం కురవసాగాయి. ఆ వానకు చెట్లన్నీ కొట్టుకుపోయాయి, భూమి చిల్లులు పడింది; కాని సిద్ధార్థుడిపైన ఒక్క చుక్క కూడా పడలేదు.

మన్మథుడికి రోషం రెచ్చిపోయింది. ఆయన ఆకాశంనుంచి సిద్ధార్థుడిపైన మండే





కొండలను కురిపించాడు, ఇసకవర్షం కురిపించాడు. ఇంకా అనేకవిధాల సిద్ధార్థుణ్ణి నాశనం చెయ్యాలని చూశాడు. అన్ని ప్రయత్నాలూ విఫలమయాయి. చివరకు ఆయన గిరిమేఖలమనే తన ఏనుగుపై ఎక్కి తన చక్రాన్నికూడా సిద్ధార్థుడిపై విసిరాడు. అదికూడా వ్యర్థమైపోయింది.

మన్మథుడు ఓడిపోయి పారిపోయాడు. తమ తండ్రి పరాభవం చూసి మన్మథుడి కుమార్తెలు ముగ్గురూ చాలా ఆకర్షవంతమైన దుస్తులు ధరించి వచ్చి, సిద్ధార్థుణ్ణి తమ వలలో వేసుకునేటందుకు, "ఆహా, ఇంత అందగాడివి ఎందుకు అరణ్యంలో తపస్సు చేస్తున్నావు? నీకు భార్యలేదా? ఆమెతో పోట్లాడివచ్చావా? ఎవరైనా నీ ప్రేమను నిరాకరించారా?" అని రకరకాల ప్రశ్నలు వేశారు. కాని సిద్ధార్థుడు వారికేసి చూడనైనా చూడలేదు. అందుచేత వారు కూడా నిష్క్రమించారు.

మన్మథుణ్ణి జయించగానే సిద్ధార్థుడికి బుద్ధత్వం వచ్చింది. శతకోటి బ్రహ్మాండాలలో అన్నికాలాలయందూ నడిచిన వృత్తాంతాలన్నీ అతని కళ్లకు కట్టినట్టయింది; జీవికి జన్మపరంపర ఎందుకు కలుగుతుందో అర్థమయింది. మర్నాడు తెల్లవారేలోపుగా అతనిలో మిగిలిఉన్న కోరికలన్నీ పూర్తిగా





నిర్మూలమైపోయాయి. అతను బుద్ధుడయాడు; అతని శరీరంలోనుంచి ఆరు రకాల రంగుల కిరణాలు వెలువడ్డాయి.

సిద్ధార్థుడు పుట్టినప్పుడు కలిగిన అద్భుతాలన్నీ తిరిగి ఇప్పుడు కలిగాయి.

బుద్ధుడు మరి వారంరోజులపాటు రావిచెట్టుకిందనే కూచున్నాడు. రావిచెట్టుకింద సిద్ధార్థుడు బుద్ధత్వం సంపాదించటంచేత దానికి బోధివృక్షమన్న పేరు వచ్చింది.

తరవాత బుద్ధుడు గాలిలోకి లేచి, అక్కడ ఒక్క క్షణం ఆగివుండి, బోధి చెట్టుకు ఈశాన్యదిశగా నేలపై వాలాడు. తరవాత ఆయన అక్కడినుంచి కన్ను ఆర్పకుండా బోధివృక్షాన్ని వారంరోజులపాటు చూస్తూ ఆరాధించాడు. ఆ ప్రదేశాన్ని అనిమిషలోచన చైత్యం అంటారు.

తరవాత బుద్ధుడు తాను వాలిన చోటు నుంచి లేచి బోధివృక్షం వద్దకూ, మళ్లీ వెనక్కూ వారంరోజులపాటు పచారు చేశాడు. అతను పచార్లుచేసిన ప్రదేశాన్ని చంక్రమణ చైత్యం అంటారు.

తరవాత బుద్ధుడు బోధివృక్షానికి వాయువ్యదిశగా కూచుని వారంరోజులపాటు ధర్మాన్నిగురించి ఆలోచించాడు. ఆయన ఇలా కూచున్నచోటును రతనఘర చైత్యం అంటారు. బుద్ధుడు అయిదవ వారమంతా అజాపాలవృక్షం కింద నిర్వాణాన్ని అనుభవించుతూ గడిపాడు; ఆరవ వారమంతా ముచలింద సరస్సు సమీపంలో ఒక చెట్టుకింద ఉండిపోయాడు. ఆ వారం రోజులూ జోరున వర్షం కురిస్తే సరస్సులో నుంచి నాగరాజు వచ్చి బుద్ధుడిపై వర్షం పడకుండా తన పడగ విప్పి గొడుగులాగా పట్టాడట! ఈ వారంరోజులూ బుద్ధుడు ధ్యానంలో గడిపాడు. ఏడవ వారమంతా కిరిపాలు అరణ్యంలో రాతిపై పడుకున్నాడు. ఈ ఏడు వారాలపాటూ ఆయన ఏ ఆహారమూ తీసుకోలేదు. —(ఇంకా వుంది)






## 4

మూడోరోజు అర్థరాత్రి గడిచాక ఒక సైనికుడు ఖాలిద్ గుడారంలోకి ఆత్రంగా అడుగుపెట్టాడు. అతని చేతిలో కాసె తాలూకు ముక్క ఉన్నది. ఖాలిద్ సంభ్రమంతో ఆ ముక్కను సైనికుడి చేతి నుంచి లాక్కున్నాడు. ఆయన ఆ సైనికుడికి బంగారునాణాల సంచీ ఇస్తూ, "ఇది నీ కెలా దొరికింది ?" అని అడిగాడు.

"ఇక్కడికి ఉత్తరంగా, ఒకరోజు ప్రయాణం దూరంలో మేము శత్రువులను గురించిన వార్తలకోసం అన్వేషించుతూ ఉండగా నలుగురు సిరియనులు ఒక గొర్రెలకాపరి సహాయంతో దారి తెలుసు కుంటూ అటుగా వచ్చారు. గొర్రెలకాపరి ఎక్కిన గుర్రం నుదుటికి ఈ కాసెముక్క కట్టి ఉన్నది. మేము వాళ్లపైన బడి దీన్ని తీసేసుకున్నాం," అన్నాడు సైనికుడు.

సైనికుడు వెళ్లిపోయాక ఖాలిద్ ఆ కాసె ముక్కను పరీక్షించాడు. అది రెండుగా మడిచి కుట్టిఉన్నది. ఆయన కుట్లు విప్పి లోపల రాసిఉన్న సందేశం చదువుకున్నాడు: "జబాబల్ ఉత్తరంగా రెండు రోజుల దూరంలో ఉన్నాడు. నిన్నటి రోజున మాన్యూల్ జబాబల్‌కు ఆరు రోజుల వెనకగా ఉన్నాడు. నేను జబాబల్ సేనను చేరుకునేసరికి ఇంకా మూడు రోజుల దూరంలో ఉంటాడు. అతను రెండు రోజుల దూరంలోకి వచ్చేలోపుగా జబాబల్ వెంట ఉన్న అరవైవేల మందిని ఏదోవిధంగా హతమార్చాలి."

ఖాలిద్ వెంటనే ఉత్తరువులిచ్చి పదివేల మంది గుర్రపు యోధులనూ, పదిహేనువేల మంది ఒంటెల యోధులనూ ఉత్తరంగా పంపాడు. వారు జబాబల్ సేనను పూర్తిగా

జి. కేశవరావు




నాశనంచేసి అయిదవ రోజు ఉదయానికల్లా శిబిరానికి తిరిగివచ్చేశారు.

మరికొన్ని రోజులకు ఇంకొక కాగె ముక్క ఖాలిద్ సైనికుల చేతిలో పడింది. ఖాలిద్ శిబిరానికేసి ప్రయాణంచేసి వచ్చే ఒక బిడారులో ముందు నడిచే ఒంటె మెడకు అది కట్టిఉన్నది. ఆ బిడారును నడిపేవాడు ఈ విధంగా చెప్పాడు:

ఈ బిడారు మాన్యూల్ సేనలకు ఆహారం చేరవేస్తున్నదట. వారికి ఒక కుర్రవాడు ఎదురుపడి, "ఈ ధాన్యాన్ని మీరు మాన్యూల్‌కు అందిస్తే అతను తోలీకూడా ఇవ్వకపోగా, మిమ్మల్ని బందీలను చేస్తాడు. మీరు దక్షిణంగా తిరిగి ఖాలిద్ సేనలుండే శిబిరానికి వెళ్లండి. మీ మొదటి ఒంటెకు ఈ తాయెత్తు కడతాను. దాని ఫలితంగా మీకు లాభమూ, గౌరవమూ లభిస్తుంది," అన్నాడట. బిడారు అమాటలు విని నేరుగా ఖాలిద్ శిబిరానికి వచ్చింది. అందులో ధాన్యంబస్తాలు మోసే ఒంటెలు నూటయాభై ఉన్నాయి!

ఖాలిద్ ఈ రెండో ముక్క విప్పి ఇలా చదువుకున్నాడు:

"మాన్యూల్ సైనికులకు తిండి లేదు. వారి ఆహార పదార్థాలు అయిదారు రోజుల దూరాన ఉన్నాయి."

మాన్యూల్‌కు ఆహారధాన్యాలు అందకుండా చేసిన కనానా యుక్తికి ఖాలిద్ నవ్వుకున్నాడు.

* * *

ఆ రాత్రే మాన్యూల్ తన సేనతో ఖాలిద్ శిబిరానికి ఉత్తరంగా వచ్చి శిబిరం ఏర్పాటు చేసుకున్నాడు. మైదానం మధ్యగా ఉన్న ఒక గుట్టపై తన దుర్గాన్ని నిర్మించుకున్నాడు. ఆ ఎత్తునుంచి చూస్తే మహమ్మదీయుల సైనిక శిబిరమంతా కనిపిస్తుంది.

"మీరంతా నా గుడారానికి వచ్చి సంధి సంప్రతింపులు జరపండి. మీరు సిరియాలో

ఎన్నటికీ అడుగుపెట్టమని భరవసా ఇస్తే మీ సైన్యాలను నిరపాయంగా తిరిగి పోని స్తాను!" అని మాన్యూల్ మహమ్మదీయ సేనానాయకులకు మర్నాడు ఉదయం కబురు పంపాడు.

అందరూ సంతోషించారు. ఖాలిద్ మాత్రం, "జబాబల్‌ను మరవకండి!" అన్నాడు. ఆకలి గొనిఉన్న శత్రుసేనలను అలస్యం చేయక ఎదుర్కొంటే విజయం నమ్మకంగా లభిస్తుందని ఆయన అంచనా.

మరొక అరగంటకల్లా మహమ్మదీయ సేనలు యుద్ధానికి నడిచాయి. ఆ రోజు సిరియా మైదానాలపైన కనీ వినని భయంకర యుద్ధం జరిగింది. మూడుసార్లు బదావీలు మాన్యూల్ సేనల ధాటికి తట్టుకోలేక వెన్నిచ్చి పారిపోయారు. మూడుసార్లు వారి స్త్రీలూ, పిల్లలూ వారికి ధైర్యంపోసి మళ్లీ యుద్ధరంగంలోకి పంపారు.

చీకటి పడేసరికి ఏ పక్షమూ గెలిచిన స్థితిలో లేదు. అయితే చాలామంది బదావీలు గ్రీకులకు యుద్ధఖైదీలుగా చిక్కారు. వారిలో కొందరు శత్రుసైనికుల మధ్య కనానాను చూసి గుర్తించారు. జబాబల్ సేనలు నాశనమయిన తరవాత కనానా వారితోబాటు పారిపోయి వచ్చి మాన్యూల్



సేనలలో చేరి నౌకరుగా ఉంటున్నాడని విని వారు చాలా ఆగ్రహించారు.

"ఈ నీచుడు ఓటమికి భయపడి, అరేబియాకోసం పోరాడటానికి బదులుగా ఇక్కడ వచ్చి దాక్కున్నాడు!" అనుకుని వారు శత్రువులతో, "వీడు జబాబల్ నౌకరు కాడు, ఖాలిద్ సేనకు చెందిన బదావీవాడు!" అని చెప్పేశారు.

వెంటనే గ్రీకులు కనానాను పట్టి కట్టేసి మాన్యూల్ దగ్గిరికి తీసుకుపోయారు.

జబాబల్ సేనను గురించీ, తమ సేనను గురించీ ఎవరో రహస్యాలు చెప్పేశారన్న అనుమానం మాన్యూల్‌కు అదివరకే

ఉన్నది. ఇప్పుడాయన ఆ నేరాన్ని కనానాకు అపాదించి, చంపటానికి కత్తిదూశాడు.

కనానా నేరం ఒప్పుకున్నాడు గాని కత్తి చూసి బెదరలేదు. "నీకు చస్తానన్న భయం లేదా?" అన్నాడు మాన్యూల్.

"నాకే భయమూ లేదు," అన్నాడు కనానా నిబ్బరంగా.

"వీడికి మరణశిక్ష చాలదు, చిత్రహింస చేయాలి. వీణ్ణి పట్టుకుపోయి భద్రంగా ఉంచండి!" అని మాన్యూల్ తన సైనికులతో అన్నాడు.

రెండోరోజు యుద్ధంలోనూ, మూడోరోజు యుద్ధంలోనూ కూడా జయం ఏ పక్షానికీ దక్కలేదు. బదావీలు ప్రాణాలకు తెగించి, "అరేబియా కోసమూ, అల్లాకోసమూ" పోరాడుతున్నారు. ఈసారి ఒక్క సైనికుడు కూడా పారిపోలేదు. గ్రీకుసైన్యాలు కొండను ఎదుర్కొన్నట్టయింది. వారు ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయారు. బదావీ సైన్యాలు ఒక్క అడుగు వెనక్కుతగ్గనూ లేదు.

నాలుగోరోజు యుద్ధం అటో ఇటో తేలిపోతుందని ఖాలిద్ అనుకున్నాడు. కాని ఆయన హృదయంలో గెలుస్తానన్న నమ్మకం నశించింది. ఈ యుద్ధంలో ఇతరులను ఆహుతి చెయ్యటం ఆయనకు నచ్చలేదు; తానే ఆహుతి కావటానికి నిశ్చయించాడు.



సైన్యానికి వెనకగా ఉండే స్త్రీలనూ, పిల్లలనూ, సైనిక కుటుంబాలనూ ఆ రాత్రే తిప్పి పంపెయ్యటానికి కూడా ఖాలిద్ నిర్ణయించాడు. వారిని సాధ్యమైనంత దూరం పోనిచ్చి తానూ, తనతోబాటు అహుతి కావటానికి సిద్ధపడినవారూ రణరంగానికి వెళతారు. మిగిలిన సైనికులు మక్కా మదీనా నగరాలకు వెళ్లిపోయి, కనీసం ఆ పవిత్ర స్థలాలైనా శత్రువుల పాలపడకుండా కాపాడుకుంటారు.

పరిస్థితులు ప్రతికూలం కావటంవల్లనే ఖాలిద్ యిలాంటి నిర్ణయానికి వచ్చాడు. ఆయన ఎన్నడూ అపజయం ఎరగడు, యుద్ధరంగంనుంచి వెనుతిరిగి ఎరగడు. ఈ సారి కూడా ఆయన వెనుతిరగబోవటంలేదు.

* * *

మాన్యూల్ శిబిరంలోకూడా రేపు జరగబోయే యుద్ధంగురించి భయంగానే ఉన్నది. ఎవరి ముఖానా ఆశాభావం లేదు. ఆ శిబిరంలో ఎంతమంది యోధులైతే ఉన్నారో అందరూ యుద్ధరంగాన కనిపించారు. వారికి ఇక అదనపు బలాలు లేవు. యుద్ధరంగంలో నిలవటం ఎంత దుర్భర సమస్యగా ఉందో, పారిపోవటమూ అంత దుర్భర సమస్యే.

సైనికాధికారులు కూడబలుక్కున్నారు. "మనకు ఆహారం వచ్చి చేరటానికి కనీసం





మూడు రోజులు పట్టుతుంది. రేపు మన యోధులు యుద్ధరంగంలో నిలిచి పోరుతారన్న ఆశ కొంచెంకూడా లేదు," అనుకున్నారు వారు.

"మహమ్మదీయులు వేల సంఖ్యలో వచ్చి మన సైన్యంలో చేరిపోతున్నారని శత్రుపక్షాన్ని నమ్మించగలిగితే వారు బెదరవచ్చు!" అన్నాడొక అధికారి.

వెంటనే మాన్యూల్ తన సైనికులతో, "ఆ వేగులవాణ్ణి ఇక్కడికి తీసుకురండి. మన సైన్యంలో చేరి పోరాడితే స్వేచ్ఛ లభిస్తుందని యుద్ధఖైదీలతో చెప్పండి. చేర నిరాకరించేవారిని చిత్రవధ చేస్తామని స్పష్టంచేయండి," అన్నాడు. సైనికులు కనానాను మాన్యూల్ ముందు హాజరు పెట్టారు. రెండు రోజులుగా తిండీ, నీరూ లేక ఆ కుర్రవాడు చాలా డస్సిఉన్నాడు.

"నేను నిన్ను చిత్రహింసలకు గురి చెయ్యబోతున్నాను. ఏమన్నా చెప్పుకునేది ఉంటే ఇప్పుడే చెప్పుకో!" అన్నాడు మాన్యూల్ కనానాతో.

"అయ్యా, యుద్ధఖైదీలలో ఒక ముసలి వాణ్ణి చూశాను. కావలిస్తే నన్ను రెట్టింపు హింసపెట్టి, ఆ ముసలివాణ్ణి విడిచి పుచ్చండి," అన్నాడు కనానా.

"ఎవరా ముసలివాడు?" అని మాన్యూల్ అడిగాడు.

"తెల్లని, పొడుగుపాటి గడ్డం కలవాడు. అలాటి ఖైదీ మీదగ్గిర మరొకడు లేడు," అన్నాడు కనానా.

"వాడితో నీకేమిటి సంబంధం?" అని మాన్యూల్ అడిగాడు.

"ఆయన నా తండ్రి," అన్నాడు కనానా.

మాన్యూల్ ముసలి యుద్ధఖైదీని పిలిపించి, "ఈయనేనా నీ తండ్రి?" అని అడిగాడు. కనానా అవునన్నట్టు తలవూపాడు.

మాన్యూల్ కనానాతో, "నీమూలంగా మాకు చాలా నష్టం జరిగింది. నీవు జరిపిన





వేగుమూలంగా జబాబల్‌ను ఖాలిద్ చిత్తుగా ఓడించాడు. మా రహస్యాన్ని నువు ఖాలిద్‌కు చేరవేసి ఉండకపోతే ఈపాటికి సంధి జరిగి మేము మక్కా మదీనాలపైకి నడుస్తూ ఉండవలిసినవాళ్లం. నువు మాకు చేసిన ద్రోహం ఇంతా అంతా కాదు. అయితే నువు వీరుడివి—ఖాలిద్‌లోకూడా నీపాటి శౌర్యం నాకు కనబడలేదు. అందుచేత నీ ప్రాణాన్నీ, నీ తండ్రి ప్రాణాన్నీకూడా నేను కాపాడతాను; నువుమాత్రం నేను చెప్పినట్టు చేయాలి. సూర్యుడు ఉదయించే సమయాన ఈ కొండ అంచున నిలబడి, ఒక ఈటె పట్టుకుని గుండ్రగా తిప్పుతూ, నీ పేరూ, నీ తండ్రి పేరూ గట్టిగా చెప్పి, 'ఇంకొక గంటలో ముప్పైవేలమంది అరబ్బులు గ్రీకు సైన్యంవెంట యుద్ధానికి వస్తున్నారు!' అని కేకపెట్టి, ఆ ఈటెను విసిరి ఒక అరబ్బీవాణ్ణి కొట్టు. గురిగా కొట్టితే ఒకణ్ణి చంపగలుగుతావు. అలా చేసినట్టయితే నిన్నూ, నీ తండ్రినీ విడిచి పుచ్చుతాను. నీకు మంచి జాగీరు ఇస్తాను. ఇలా చేయ నిరాకరించావా, నిన్నూ నీ తండ్రినీకూడా చిత్రవధ చేస్తాను!" అన్నాడు.

ఈ మాటలు వినేవరకూ కనానా తండ్రి తన కొడుకును గురించి అపోహపడుతూనే ఉన్నాడు. ఇప్పుడాయన తన కొడుకును చూసి గర్వపడుతూ, "కనానా, నా తండ్రీ! నిన్నుగురించి అపోహపడ్డానురా! నా ముసలి ప్రాణాన్ని కాపాడేటందుకు జాతిద్రోహం మాత్రం చేయకు! నువు ఎన్నడూ ఈటె చేతబట్టలేదు. ఈ నీచుడి మాట విని అలాటి పని చేయకు," అన్నాడు.

కనానా తండ్రి మాటలు వినిపించుకోలేదు. అతను మాన్యూల్‌నే చూస్తూ, "సూర్యోదయం అయినదాకా వ్యవధి ఇస్తారా? నేను ఆలోచించుకోవాలి!" అన్నాడు. మాన్యూల్ ఇందుకు ఒప్పుకుని తన సైనికులతో, "వీణ్ణి కొండ అంచుకు తీసుకు



పోయి అక్కడ ఒంటరిగా కూచోనివ్వండి," అన్నాడు. కనానా వెళ్లి కొండఅంచున కూచుని లోయలోకి చూపు నిగిడ్చి చూసి, ఆ మసకచీకటిలో అరబ్బులసేనలు తిరోగమిస్తూండటం గుర్తించాడు. దూరాన గుడారాలు దించటమూ, ఒంటెలు దక్షిణంగా కదిలిపోతూండటమూ కనిపించింది.

అతను తన చొక్కాలోపల ఉన్న కాసె నుంచి మరొక ముక్క చించి దానిపైన తన రక్తంతో, "పారిపోవద్దు, శత్రువులు నీరస స్థితిలో ఉన్నారు. వారి వెనుకనుంచి దెబ్బ తీయండి!" అని రాసి చొక్కాలో పెట్టేసుకుని, నిశ్చలంగా కూచున్నాడు.

సూర్యోదయం అయేసమయాన ఒక సైనికుడు వచ్చి అతని భుజంమీద తట్టి, "సూర్యుడు ఉదయించబోతున్నాడు," అని హెచ్చరించాడు.

కనానా మాన్యూల్ గుడారాన్ని ప్రవేశించి, "ఈటె ఇప్పించండి!" అన్నాడు. అతనికి ఒక ఈటె ఇచ్చారు. అతను దాన్ని కింద పారేసి, "ఇంకా బరువైనది లేదా?" అన్నాడు. అతను బరువైన ఈటె తీసుకుని కొండఅంచుకు నడిచిపోతూ, కాసె ముక్కను చొక్కాలోనుంచి తీసి ఈటెకు చుట్టాడు.

అతనికి కొంచెం వెనకగా మాన్యూల్ నిలబడి, "భయపడకు, చెప్పినట్టు చేయక



పోతే నీ తండ్రి కళ్లు పొడిచేయిస్తాను!" అన్నాడు కఠినంగా.

కనానా వెనక్కు తిరిగికూడా చూడలేదు. "అదుగో, దూరాన ఆ కదిలేవాడు ఖాలిద్. అతని గుర్రం ఈ బెవేటు దూరంలోకి వచ్చిన దాకా ఆగితే మీరు సంతోషిస్తారా?" అన్నాడు.

"భలే కుర్రవాడివి! మంచి సాహసు డివి!" అన్నాడు మాన్యూల్. "నువు ఖాలిద్‌ను చంపావంటే నిన్ను బంగారంలో బతికున్నాళ్లూ తూస్తాను!"

ఖాలిద్ కొండమీది కనానాను చూశాడు. ఆయన మిగిలిన సైనికులను దూరంగా వదిలి తన గుర్రాన్ని కొండకేసి పోనిచ్చాడు.

"ఇదే తరుణం! ఊఁ!" అన్నాడు మాన్యూల్ వుత్సాహంగా.

కనానా ఈ బెను మెల్లిగా పైకెత్తి తిప్పుతూ, "నా తండ్రి ఎడారి భయంకరుడు. నాపేరు కనానా!" అని కేక పెట్టాడు. లోయలో ఉన్న సైనికులంతా అతనికేసే చూస్తున్నారు.

"మరొక గంటలో ముప్పైవేలమంది అరబ్బులు గ్రీకులవెంట పోరాడనున్నారు!" అన్నాడు కనానా. తరవాత అతను తన బలమంతా ఉపయోగించి ఈ బెను ఖాలిద్ వేపు విసిరాడు. అతను మాట్లాడుతున్నంత సేపూ ఖాలిద్‌లో ఎట్టి చలనమూ లేదు.



ఈటె చాలా గురిగానే తగిలింది. అది ఖాలిద్ గుర్రం తలలో సూటిగా గుచ్చుకున్నది. గుర్రం అక్కడే చచ్చిపడింది. ఖాలిద్ తాపీగా పడిపోయిన గుర్రం మీది నుంచి లేచి, ఈటెను గుర్రం తలనుంచి ఊడలాగి అది పట్టుకుని తన సైనికులకేసి వెళ్లిపోయాడు.

ఈలోపల లోయలో ఉన్న అరబ్బులు, "ద్రోహి! నీచుడు!" అని గోలగా కనానాను శాపనార్థాలు పెట్టసాగారు.

మాన్యూల్ చాలా తృప్తిపడ్డాడు. మరి కొంచెంసేపటికి మైదానంమీద చాలా కొద్ది మంది అరబ్బు కాలిబంట్లు మాత్రమే ఉన్నట్టూ, మిగిలిన సైనికులు పారిపోయినట్టూ తెలియవచ్చింది. మాన్యూల్‌కు ఎక్కడలేని ఆనందమూ కలిగింది.

"మన సైనికులలో ఓపిక ఉన్నవారిని యుద్ధరంగానికి పంపండి. మనం జయించినట్టే!" అన్నాడు మాన్యూల్.

నాలుగోరోజు యుద్ధం ఆరంభమయింది. కాని దాన్ని యుద్ధం అనటానికి లేదు. బదావీలు ముందు అడుగువేయాలన్న ఉత్సాహం కొంచెంకూడా కనబరచలేదు. వారిని వెనకకు తరిమికొట్టే ఓపిక మాన్యూల్ సైనికులకూ లేకపోయింది.

ఒక గంట గడిచింది. అకస్మాత్తుగా మాన్యూల్ సైన్యాల వెనకపార్శ్వంలో కోలాహలం బయలుదేరింది. పదివేల గుర్రాలపైనా, ఇరవైవేల ఒంటెలపైనా అరబ్బులు వచ్చి మాన్యూల్ సైన్యాల వెనుకభాగాన దెబ్బతీశారు. మాన్యూల్, ఆయన సేనలూ మట్టిపాలు అయాయి.

కనానా ఒకే ఒక్కసారి ఈటె పట్టాడు. అదికూడా అరేబియాకోసమూ, అల్లాకోసమూనూ! అరేబియాను ఒంటిగా రక్షించిన ఈ అహింసాయోధుడు పట్టిన ఈటెను ఇప్పటికీ అరబ్బులు పూజిస్తారు.

—(అయిపోయింది)



# మీకు తెలుసా?

రోమ్‌నగరంలో ఒకప్పుడు స్త్రీలు రథాలు తోలేవారు. కాని క్రీస్తుకుపూర్వం 205 సంవత్సరంలో ఈ అలవాటును నిషేధిస్తూ ఒక చట్టం అమలుచేశారు. మరి 25 ఏళ్ల అనంతరం ఈ చట్టం రద్దయింది.

*　　*　　*

క్రీస్తుశకం 16, 17 శతాబ్దాలలో హంగరీ, పోలండు దేశాలలో 30 తులాల బరువు గల బంగారు నాణాలు అమలులో వుండేవి.

*　　*　　*

ఉద్యోగాలుచేసే మగవాళ్లకన్న ఇంటిపనిచేసే స్త్రీలు చాలా ఎక్కువ శరీరశ్రమచేస్తారు.

*　　*　　*

సహారా ఎడారి అంతా ఇసుకకాదు. అందులో హెచ్చుభాగం రాతినేలా, గులకనేలా.

*　　*　　*

సూర్యుడిచుట్టూ తిరిగేగ్రహాలలో పెద్దవి తొమ్మిదిగాక, చిన్నవి సుమారు 1600 వున్నాయి.

*　　*　　*

మనం చూసే కాకి చిప్పలు చాలా చిన్నవి. వాటిలో ఉండే జంతువులు చచ్చిపోయాక మనం వాటి తాలూకు చిప్పలను చూస్తాం. ఈ జంతువులలోకెల్లా పెద్దది నాలుగు అడుగుల నిడివి ఉండి, 25 మణుగుల బరువుంటుందట.

*　　*　　*

పెంపుడు కుక్కలకంటె పెంపుడు పిల్లులు చాలా ఎక్కువకాలం బతుకుతాయి. కుక్కలు సామాన్యంగా ఇరవై ఏళ్లకుమించి బతకవు, పిల్లులు ముప్పై ఏళ్లు దాటి బతుకుతాయి.

*　　*　　*

సోవియట్ రష్యాలో సముద్రం అడుగునుంచి పెట్రోలియం తోడుతున్నారు. మామూలుగా భూమిలోనుంచి తోడే పెట్రోలియంకన్న ఇది రెండున్నర రెట్లు చవుక.

*　　*　　*

మీరు 'చందమామ'లో ఇప్పుడు చదివే పంచతంత్రం చాలాకాలం క్రితమే రష్యన్ భాషలోకి అనువాదమయింది. బేతాళకథలు కూడా రష్యన్‌లో వెలువడ్డాయి—అసలు బేతాళకథలు, కల్పితాలు కాదు.

# చంద్రయానంలో చిక్కులు

మనం ఏదైనా కొత్తదేశం వెళ్లేటప్పుడు అక్కడి వాతావరణం గురించీ, ఆచార వ్యవహారాలను గురించీ ముందుగా తెలుసుకుంటాం. చలిదేశానికి వెళ్లేవాళ్లు ఉన్ని తొడుగులు సిద్ధం చేసుకుని మరీ బయలుదేరుతారు. అలాగే చంద్రమండలానికి ప్రయాణమయేవారుకూడా అక్కడి పరిస్థితులను గురించి తెలుసుకుని ఉండటం అవసరం.

చంద్రుడు భూమికి ఉపగ్రహం; అంటే భూమి చుట్టూ తిరుగుతూ, సూర్యుణ్ణి చుట్టి రావటంలో భూమిని అనుసరిస్తూ ఉంటుంది. అది భూమిని ఒకసారి చుట్టిరావటానికి 27 న్నర రోజులు పడుతుంది. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతూ ఉండక ఒకేచోట నిలబడి ఉండే పక్షంలో ఒక పూర్ణిమకూ, మరొక పూర్ణిమకూ మధ్య 27 న్నర రోజులే ఉండును. కాని భూమికూడా నడుస్తూ ఉన్నందున ఒక పూర్ణిమకూ మరొక పూర్ణిమకూ మధ్య 29 న్నర రోజులుంటున్నది.

భూమి 24 గంటల కొకసారి ఆత్మ ప్రదక్షిణం చేస్తున్న సంగతి మనకు తెలుసుగద. అలాగే చంద్రుడుకూడా ఆత్మ ప్రదక్షిణ చేస్తున్నది. అయితే చంద్రుడి ఆత్మ ప్రదక్షిణం నెలరోజులు పడుతుంది. ఆ కారణంచేతనే మనం ఎల్లప్పుడూ చంద్రుడిలో ఒక అర్ధ భాగాన్నే చూస్తున్నాం. చంద్రగోళం పై భాగంలో నూరింట 41 వంతు ఎన్నడూ భూమికేసి తిరగదు.

దీనినిబట్టి చంద్రగోళంమీద మన పదిహేను రోజులు పగలు, మరి 15 రోజులు రాత్రి. అంటే పగలుగా ఉన్న ప్రాంతం సూర్యుడి వేడికి 15 రోజులపాటు కాలుతుంది. రాత్రిగా ఉన్న ప్రాంతం 15 రోజుల



చంద్రుడిలో ఉదయమూ, పూర్వాహ్నమూ, మధ్యాహ్నమూ, అపరాహ్నమూ, అస్తమయమూ—రెండువారాలు!

పాటు సూర్యరశ్మిలేక చలికి బిగుసుకు పోతుంది.

మన భూమిచుట్టూ అనేక వందల మైళ్ల మేర దట్టమైన గాలి పొరఉండి సూర్యకాంతి యొక్క తీక్షాన్ని తగ్గిస్తున్నది. చంద్రుడిలో గాలిలాటిది ఏమీ ఉన్నట్టు కనబడదు. ఉంటే బహు స్వల్పంగా ఉండాలి. అందుచేత చంద్రుడిపై పడే సూర్యకాంతి భూమిపై పడే కాంతి కంటె చాలా తీక్షంగా ఉండాలి.

గాలిపొర మనని సూర్యకాంతి నుంచేగాక, అపాయకరమైన కాస్మిక్ కిరణ ప్రసారం నుంచీ, ఉల్కలనుంచీ రక్షిస్తున్నది. ఉల్కలు అతివేగంగా గాలిపొరను ప్రవేశించి గాలి రాపిడికి అంటుకుని కొన్ని వందల మైళ్ల ఎత్తునే భస్మమై పోతున్నాయి. సొంతం కాల కుండా భూమిపైన పడే ఉల్కలు బహు అరుదు. చంద్రమండలంలో అలాటిది జరగదు. చంద్రుడు ఆకర్షించే ప్రతి ఉల్కా అతిభయంకరమైన వేగంతో వచ్చి చంద్రుణ్ణి తాకుతుంది.

భూమిచుట్టూ ఉన్న గాలిపొర సూర్య కిరణాలలో కొన్నిటిని అన్ని వైపులకూ చెదర గొట్టటంచేత ఆకాశం మనకు నీలపు కాంతిని ఇస్తున్నది. ఈ కాంతి వల్లనే మనం పగలు ఇళ్లలో ఉండికూడా సమస్త వస్తువులనూ చూడగలుగుతున్నాం. గాలిపొర లేకపోవటం చేత చంద్రుడి మీదినుంచి చూస్తే ఆకాశం కారునలుపుగా కనిపిస్తుంది. ఆ ఆకాశంలో ఒక పక్క సూర్యుడు ప్రకాశిస్తూఉంటే, మిగిలిన ఆకాశంలో నక్షత్రాలు దేదీప్య మానంగా ప్రకాశిస్తూ కనిపిస్తాయి. అకాశంలో ఒకవంక సూర్యుడు వెలుగుతున్నప్పటికీ అక్కడి కొండల నీడల్లో ఉండే వివరాలు ఏమాత్రమూ కనిపించవు; వాటిని చూసే టందుకు "ఆకాశపు వెలుగు" ఉండదు.

గాలిపొరవల్ల భూమిమీద ఉండే ప్రాణులు అస్తమానమూ గాలి ఒత్తిడికి గురి అవు తున్నాయి. అకస్మాత్తుగా మనచుట్టూ ఉన్న గాలిపొర మాయమైనట్టయితే మనము గాలి పీల్చలేని కారణంచేత చచ్చిపోయేలోగా మన



చంద్రమండలంలో నేల ఇలా వుంటుంది

శరీరంలో ఉండే రక్తమూ, ఇతర ద్రవాలూ ఉడకనారంభించి బాంబులు పగిలినట్టు పగిలిపోతాం. గాలిలేని చంద్రుడిలోకి ప్రయాణం చేసేవారికికూడా ఇదే ప్రమాదం ఉన్నది. అయితే ఈ ప్రమాదం చంద్ర ప్రయాణీకులకు భూమిని వదిలి పెట్టగానే ఏర్పడుతుంది, చంద్రుడిమీదికి దిగాక కొత్తగా ఏర్పడదు.

గాలి తరవాత ముఖ్యమైన ప్రాణాధారం నీరు. చంద్రమండలంలో నీటిచుక్క అన్నది ఉన్నట్టు కనబడదు. ఆకాశంలో ఉండే ఇతర గ్రహాలనుంచిగాని, చంద్రుడినుంచిగాని భూమిని చూసినట్టయితే దాన్ని చుట్టి ఉండే మేఘమాలలు కనిపిస్తాయి. కాని చంద్ర మండలంలో ఎక్కడా ఒక్క మబ్బుతునక లేదు. చంద్రమండల యాత్రికులు తమకు అవసరమైన గాలినీ, నీరునూ కూడా వెంట తీసుకుపోవాలి.

వారు తమ ఆహారాన్నికూడా విధిగా వెంట తీసుకుపోవాలి. మనం భూమిమీద జీవించ గలుగుతున్నామంటే ఇతర ప్రాణులను—శాకాహారాన్నే, మాంసాహారాన్నే—తినటం మూలానే జీవిస్తున్నాం. కాని చంద్రుడిలో ఎట్టి ప్రాణులుగాని లేనట్టు కనబడుతుంది. గాలీ నీరూ లేని గోళంలో ప్రాణులు పుట్టటం గాని, పెరగటంగాని, పరిణామం చెందటం గాని సాధ్యంకాదు. చంద్రుడిలో అడుగు పెట్టే తొలిప్రాణి మానవుడే కావాలి.

ఈ ప్రమాదాలన్నిటికీ తోడు చంద్రుడి పైభాగంనిండా అగ్ని పర్వతాలుండవచ్చు. ఒక అగ్ని పర్వతం నిప్పులు కక్కటం ఇటీవల ఒక సోవియెట్ శాస్త్రవేత్త గమనించాడు.

చంద్రయానం ఇన్ని ప్రమాదాలతో కూడుకుని ఉన్నప్పటికీ మానవులు ఈ ప్రమాదాలన్నిటికీ ఏవో విరుగుళ్లు కనిపెట్టి చంద్రలోకంలోకి వెళ్లి తిరుతారని మనం రూఢిగా నమ్మవచ్చు. ఎందుచేతనంటే మానవుడు ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనటానికి తగిన శాస్త్రవిజ్ఞానాన్ని సాధిస్తున్నాడు.



భూమి నుంచి చంద్రమండలానికి చేరిన ఆకాశప్రయాణీకులు

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఆకాశంలో అన్నయ్య

రెండవ ఫోటో : అంధకారంలో తమ్ముయ్య

పంపినవారు : ఎస్. ఆర్. కె. గోవిందరావు,

C/o. కోస్ట్‌వైజ్ క్యారియింగ్ ఏజన్సీ, కాకినాడ.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు బంతి ఆట ఆడుకుంటూ వుండగా అది ఎగిరివెళ్లి ఒక చెట్టుకింద పడింది. ఆ చెట్టుకు కట్టివేయబడి వున్న ఒక ఎద్దు, దాసూ వాసూలను బంతి దగ్గిరకు రానీయకుండా పొడవబోయింది. 'టైగర్' ఎద్దు వెనకగా వెళ్లి దానిని కవ్వించేసరికి, అది 'టైగర్' వెంటబడింది. 'టైగర్' చెట్టు చుట్టూ పరిగెత్తటం ప్రారంభించింది. ఎద్దుకూడా దాన్ని వెంటాడుతూ తిరిగే సరికి, దాని మెడలోని తాడు చెట్టుకు మెలివేసుకుపోయింది. ఆ అదనులో 'టైగర్' బంతిని నోట కరుచుకుని దాసూ వాసూల దగ్గిరకు తెచ్చింది.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

†

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**(Rule 8 Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing<br>Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS,<br>1. Sri. B. Venugopal Reddi.<br>2. Smt. B. Seshamma.<br>3. Smt. B. Rajani Saraswathi.<br>4. Smt. A. Jayalakshmi.<br>5. Kumari B Sarada.<br>6. Sri. B. L. N. Prasad.<br>7. Sri. B. Viswanatha Reddi.<br>8. Sri. B. Venkatrama Reddi. |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*10th March, 1959*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*

Photo by Madangopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంధకారంలో తమ్మయ్య

పంపినవారు :
గోవిందరావు - కాకినాడ

